

# స్రవంతి

350

సాహిత్య మాస పత్రిక

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

గౌ॥ నందమూరి తారక రామారావుగారు



సాహిత్య మాస పత్రిక

# 350


జూన్, 1983 సంపుటి : 30, సంచిక : 3

వార్షిక చందా : పది రూపాయిలు విడిప్రతి : ఒక రూపాయి



సంపాదకులు :

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఈ సంచికలో



——

సంపాదకీయం :

# విజయవాడలో మహానాడు

ఈ మాసం 26, 27, 28 తేదీలలో విజయవాడ పట్టణమునందు తెలుగు దేశం పార్టీ ప్రథమ వార్షికోత్సవం పెద్దస్థాయిలో జరిగింది. ఆంధ్రప్రదేశ్ నాలుగు చెరగులనుంచి లక్షల సంఖ్యలో జనం విజయవాడ విచ్చేసి మహాసభల్లో పాల్గొన్నారు. ప్రజల్లో నూతనోత్సాహం పెల్లుబుకుతూవున్నది. బహిరంగసభలో వేదిక మీదినుంచి చూస్తే మహామానవసాగరం పొంగి పొర్లిందా అని అని పించింది. మహాత్మాగాంధీగారి ప్రార్థనా సభలు జ్ఞప్తికి వచ్చాయి. ఏమి జనం! ఏమి జనం! వేడుక చూచేందుకు వచ్చిన జనం వారిలో తక్కువేనని చెప్పక తప్పదు. ప్రతి వ్యక్తిలోను ఏదో తపన, ఏదో వ్యథ, ఏదో అశాంతి. స్వాతంత్ర్యం లభించి యిన్ని సంవత్సరాలైనా సురాజ్య స్థాపన జరగలేదనే తహతహ కొట్టవచ్చినట్లు కనబడింది. ప్రజలు, పిడికట్టు వాదాలు, శుష్క సిద్ధాంతాలు విని విని విసిగెత్తిపోయారు. చేతలు కోరుతున్నారు. అందుకోసమే తెలుగు ప్రజలు తెలుగుదేశం పార్టీ నాయకుడు శ్రీ నందమూరి తారక రామారావు గారి మీద విశ్వాసం వుంచి విజయం సాధించిపెట్టి, వారికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బాధ్యత అప్పగించారు

తెలుగుదేశం పార్టీ శైశవావస్థలో వున్నది. మహానాడులో అడుగడుగునా కనబడిన వ్యక్తిత్వం ఒక్కటే ఒక్కటి. అది శ్రీ రామారావుగారి వ్యక్తిత్వం. రోజు రోజుకు వారి శక్తి పెరిగిపోతున్నది. ప్రాతఃకాలం 3 గంటల నుంచి రాత్రి 9 గంటల వరకు విరామం లేకుండా కార్యక్రమాలు సాగిస్తున్నారు. ప్రజలకు మేలు చేయడమే వారి జీవిత ఏకైక లక్ష్యంగా కనిపిస్తున్నది. వారి నిజాయితీ,ధర్మనిష్ఠతిరుగులేనిది.తెలుగుదేశం పార్టీ లోపల;బయట కూడా స్థిరత్వం తెచ్చుకొని, బలం పుంజుకొని ఆరుకోట్ల తెలుగు ప్రజల్ని అన్ని రంగాల్లోను పగతి పథాన ముందుకు నడిపిస్తుందని ఆశిస్తున్నాం. 60 సంవత్సరాలు దాటి 61వ సంవత్సరంలో అడుగు పెట్టిన శ్రీ నందమూరి తారక రామారావు గారికి కర్తవ్య నిర్వహణకు అవసరమైన శక్తి సామర్థ్యాలు, ఆయురారోగ్యాలు ప్రసా దించవలెనని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాం.

# ఘంటానాదం

—పైడిపాటి సుబ్బరామశాస్త్రి

గణ గణ గణ గణా గంట మ్రోగింది—
అది, స్కూలు గంట కాదు,
కాలేజీ గంట కానేకాదు.
నవంబరు 8వ తేదీ, 1979వ సంవత్సరంలో మ్రోగింది
అర్ధరాత్రి 12-55 నిముషాలకు
తిరుపతి వేంకటేశ్వరాలయంలో మ్రోగింది.
ఆనాడు శ్రీరామచంద్రుని జన్మనక్షత్రం
పునర్వసు!
1977వ సంవత్సరం ఏప్రిల్ 12వ తేదీన
ఎటూకాని వేళ ఘంటానాదం విన్పించింది
అయితే ఆనాడు స్వామి వారి జన్మనక్షత్రం
అర్థరాత్రి వేళ దేవతలు వచ్చి పూజ చేస్తారని
కథలున్నాయి. దేశంలో!
దేవుడే లేడనే వాడికి ఏదీ లేదు!
ఉన్నాడనే వాడికి అన్నీ ఉన్నాయి.
దేవుడు లేని వాడు కూడా తానున్నానంటాడు
అంత వఱకయినా అతనికి విశ్వాసం ఉన్నందుకు
మనం సంతోషించవచ్చు.
అసలు ఒక విశ్వాసంతోనే బ్రతుకుతోంది లోకం!
ఒకడికి ఒక దాని మీద-మఱొకడికి మఱొక దాని మీద!
లేక పోతే మిగిలేది, నిరాశ, నిస్పృహ!

# ఆదికవికి అంజలి

— తిరునగిరి

ఆంధ్ర భారతి పుణ్యమా అన్నయట్లు
ఈ పవిత్రాంధ్ర మందువేయేళ్ళ క్రింద
శ్రీ మహాభారతమ్ము రచించినట్టి
ఆదికవి నన్నయకు భక్తి అంజలింతు.
పుణ్య గోదావరీ తీరభూమియందు
రాజమహేంద్ర పురాన శ్రీ రాజరాజు
కోర్కె నంగీకరించి మా కొరకు నీవు
భారతాను వాదమ్ము చేపట్టినావు.

భారత సంహితన్ జదువు భాగ్యము అబ్బిన తెల్గువాడుని
సారమతిన్ గ్రహించియు ప్రసన్న కథాకలి తార్థ యుక్తికిన్
హారతులెత్తు నీతెనుఁగు నందలి సూక్తి నిధిత్వ మెట్టిదో
సారసరమ్య పద్యముల నెంతయుతానెలుగున్ మహాకవీ !
తీయని తెన్గు పద్యములదేసని నీవువచించుచుండనా
రాయణభట్టు అందముగ వ్రాసెనటంచును భారతమ్మునన్
ఓయిమహాకవీ ! పలుకవో మధురాక్షర బంధురమ్ము మీ
తీయని స్నేహబంధము క్షితిన్ స్థిరమై విలసిల్లు భవ్యమై.

ఆంధ్ర భారతము చదువనట్టివాడు
వాడు ఆంధ్రుడు ఏనాడు కాదు కాదు
ఆదికవి వర్య! గైకొను మారుకోట్ల
తెలుఁగు ప్రజలిచ్చు భక్త్యంజలులను నేడు.
(ఆదికవి నన్నయ సహస్రాబ్ది ఉత్సవాల సందర్భంగా)

పోచమ్మవాడ
ఆలేరు, నల్లగొండ జిల్లా

# నవలొకటి వ్రాశా

డా॥ రావూరు

నవలొకటి వ్రాశాను
నానా తిప్పలుపడి.
నలుగురు దగ్గిరికి పరుగెత్తాను
చదివి వినిపిద్దామని.
నాలుగు నెలల దాకా నాకెక్కడా
తీరిక లేదన్నాడొకాయన.
"నాకునవలలంటే ఇష్టంలేదు.
కష్టపడి వ్రాశారు మీరు
వినేవాళ్ళ దగ్గరకు వెళ్ళండి"
అన్నాడింకో ఆయన.
"అచ్చులో వెయ్యండి
ఆతర్వాత చూద్దాం.
వ్రాత ప్రతులు చదివేగీత
నాముఖాన వ్రాయలేదు బ్రహ్మ"
అన్నాడింకో ఆయన.
నవలా? మీ రెందుకు వ్రాశారు.
ఆషామాషీ వ్రాస్తున్నారుగా
అదేకొన సాగించండి
అప్పుడప్పుడు చదువుతూ వుంటా"
అని ఒకాయన సలహా ఇచ్చాడు.
ఒకళ్ళను బ్రతిమాలడందేనికనివొళ్ళు
వంచుకొని వారం రోజులు
మేలు ప్రతి తయారుచేసి
ఒక పత్రిక్కి పోస్టుచేశా
సీరియల్ గావెయ్యండి సీరియస్ కథ
అని విజ్ఞప్తిచేశా.
ఆరు నెలలుగడిచినాయి
ఆశలు గుండెల్ని పిడిచినాయి
అర్ధరాత్రి వేళ కన్నీళ్ళతో
చెక్కిళ్ళుతడిసినాయి.
కొన్నాళ్ళకు సంపాదకుల లేఖ
సారంగ ధరుని పావురంలా
వచ్చివ్రాలింది నా చేతిలో
చప్పుచప్పున విప్పిచదివాను
" ఇలాంటి నవలలు వేసే అవకాశం
ఇప్పట్లో మాకు లేదు
దీన్ని పుస్తకంగా ముస్తాబు చేసి
అకింత మివ్వండి ఆయిన వాళ్ళకు
అప్పుడు మన పత్రికలో
చక్కని సమీక్ష వ్రాయిస్తా
అని వున్నాదా లేఖలో
అందులోనే కనిపించకుండా
నానుదుటి లేఖ కూడాదాగి వుంది.

3-4-813 బర్కత్‌పురా
హైదరాబాదు. 27.



# సూర్యుడా! హత్య చేయకు!!

— పోతుకూచి సాంబశివరావు

ఈ గ్రీష్మ ప్రచండ ఉష్ణవాయువులు
భీష్ముడు కురుక్షేత్రం లో
విసిరే అగ్ని బాణాలు లావున్నాయి.
ఈ వేసవి తడి పీల్చే సే దాహం
ఈత పళ్ళు, కొబ్బరి నీళ్ళు తీర్చడంలేదు.
ఒడలు మీద కారే స్వేద నదులను చూస్తే
ప్రభుత ఎడారులకు పంపేలావుంది.
గడ్డి పరక, తాటాకు, దూదిపింజ
నిప్పు రవ్వల్లా మారి దీపావళి ఔతోంది
ఎంత అందమున్నా అమ్మాయిల
వదనాలు వాడిన పువ్వుల్లా మారాయి.
ఎంత హుందావున్నా, అబ్బాయిల
ఆకారాలు, వాడిన తోటకూర
కాడల్లా నిలిచాయి.
సూర్యుడా ! నీ ప్రేమ మండిపోను
మా భూమికి దగ్గరగా వచ్చి
మరు భూమిగా మారుస్తా వెందుకు?
అతి ప్రేమ కూడా అత్యంత ప్రమాదకరం
నీవేడి మెదడులో పిచ్చిఎక్కిస్తోంది
పాశ్చాత్య దేశాల పైన నీకు పక్ష
పాతం ఎక్కువ.
వేసవి ఎండల్లో కూడా చంద్ర దరహాసాలు
విరజిల్లు తావట

పుణ్యభూమి భారతావనిలో
వన్యమృగాల వంటి పాపులకానీవేడి !
వృక్షాలే లేకపోతే నీవేడికి హద్దేలేదు.
వసంతుడు పూత ఫలాలు ఇచ్చి
నీ విలయానికి మందు ఇస్తున్నాడు
చంద్రుడు నీతో ముష్టియుద్ధం చేసి ఓడిస్తే
నీ వేడిపొగరు కొంత తరగవచ్చు
నీతోటే వేగలేక ఛస్తూంటే
శత కోటి సూర్యులు విశ్వంలో వుంటే ఎలా?
ఎప్పటి కైనా నీవూ ఒక చుక్కవై
ఆకాశంలోకి దూరంగా పోయి
భూమి పై పరిపాలనకు
నేటిమంత్రి వంటి బలహీనుని పంపరాదూ!
ఇక్కడ ప్రజాస్వామ్యం ఉందికదూ
నీవు ఒక భజన స్వామిగా మారరాదూ !
రామరాజ్యంలో నీవు ఎలా వున్నావో కాని
ఈ కామ రాజ్యంలో నీకు ఎక్కడా
చోటు లేదు.
ఎన్నికల్లో వోటర్లను చంపినట్లు
వీధుల్లో అనాధులను హత్య చేయకు
నీవాడి వేడిని నేనాడి పోసుకున్నానను కోకు
కవిని కనుక నిరంకుశంగా పేలేనంటే-

న్యూ బోయిగూడ
సికింద్రాబాద్.

# మత రాక్షసి కరాళ దంష్ట్రిల్లో గులాంయాసిన్

—డాక్టర్ అంతటి నరసింహం

1. అయ్యోయెంతటి ఘోరవార్త శ్రుతిలో నాస్ఫాల్యమానమ్మయెన్
కుయ్యోమొఱ్ఱని భార్యయున్ కొమరుడున్ కూతున్ మొరల్ వెట్టి వ
దయ్యా చంపగవద్దువద్దనువుతీయన్ వద్దటంచార్వన
య్యయ్యో మిత్రు గులాము యాసీను నురమ్మందున్ కుఠారమ్ముతో
వ్రయ్యన్ వ్రేసి కుటుంబమున్ నరికి కుప్పల్ గూల్చిరా ధూర్తులై

2. ఎవ్వరిజోలికిన్ జనడ దెవ్వరితో పరిహాసమాడడిం
కెవ్వరి నెంత లెమ్మనడు, హీనగుణాతిశయుల్ మతభ్రమన్
క్రొవ్విన ధూర్తమానవుల కోవకురా డెదిరించి తిట్టినన్
నవ్వుల రువ్వునట్టి కవినాయకుడైన గులాముయాసినే

3. హిందువులో మహమ్మదు మతేయులో యెవ్వరో వారి పేరుకున్
కందును గూర్ప నెంచిన వికర్మలో యెవ్వరో కాని తామిదే
సందని మానభంగములు సంపద దోపిడి దొమ్మి సేయుటల్
గొందటి ప్రాణమానములు గొంట యిదేమిటి మానవత్వమో.

4. ఎక్కడనైన వీరులు మృగేంద్ర సముల్ పగ తీర్చుకోతలం
పొక్కెడ గల్గినన్ బలిమినొండొరులుక్కడగించుకొంటకై
ఒక్కెడచేరి ద్వంద్వ సమరోగ్రత మారణ మొంద వచ్చుగా
నిక్కరణిన్ ఛలమ్మునను హీనముగన్ వధియింప వచ్చునే.

5. రేచుల్ సాధుమృగాల బట్టుకొనుచున్ రెబ్బల్లి కంఠమ్ములన్
తాచుంగైవడి సాధుమానవుల ధూర్తత్వమ్మునన్ జంపిరే
ఔచిత్యానకు దూరమైన హృదయాలందెక్కడైనన్ గటా
తోచంగా నగునే దయా సుగుణ సందోహమ్ము లెప్పట్టునన్.

3-4-705/5 నారాయణగూడ,
హైదరాబాదు 29.

# అస్పృశ్యత

— డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు.

ఇది విషాదగీతికవోలె మది కలంచు
ఇది యపశ్రుతివలె జనహృది కలంచు
ఇది మహామ్మారివలె జాతినే దహించు
అంటరానితనమ్ము దురంతమగుట

కులము - మతము లడ్డుగోడలై నిల్చెను
భారతమ్ము సమర భారతముగ
వరలుచుండె నేడు, వర్గ వైషమ్యమ్ము
తొలగు కొఱకు కృషిని సలుప వలయు.

మున్నొక 'నందనారు' మునిముఖ్యుడుగా పెనుపొంది యెంతయో
వన్నెయు వాసియుంగనెను, వానిని దేవతా భజించి సై
ర్వోన్నతి నందె - ఆ సమత సూత్రముగా గొని జాతి నెత్త, సం
పన్నులు సాధువుల్ కలసి బాటలు వేయవలెన్ హితార్థులై

ఏకనాథుడు హరిజన నింట విందు
గుడిచి యస్పృశ్యతను మున్ను కూల ద్రోసె
ఎన్నొ వందల యేండ్లయ్యె ఇట్లు జరిగి
అదియె వరవడిగా జాతి యలరవలదె.

వ్యాసభారతమున వర్ణ వ్యవస్థకు
పట్టలేదు నేటి పాడుగోల
కవుల కలము లెన్ని కావ్యమ్ము లల్లెనో
సమత నిలుపు కొఱకు, చదివి చూడు

అంటరానితనము హాలాహలము వోలె
కాల్చుచుండె జాతి కమిలి పోవ,
సమసమాజరీతి స్థాపింపవలెనన్న
తొలగవలె పిశాచి తొలగినట్లు.

మానవత యొక్కచే ప్రజామతము నేడు
మతము మానవ జాతిలో మమతలూర్చి
స్నేహగంగను పారింపజేయ వలయు
అప్పుడే మతమనుమాట కర్థముండు

సంఘవాహినిలో నెట్లొ జారిపడిన
దీ దురంత కశ్మలము, సహింపరాదు
త్రోసివేయుడు తెడ్డులు త్రోసికొనుచు
తరలిరండు వేగము కర్ణధారులార !

ముట్టరానిది చీకటి ముద్రలోన
నల్లవర్తకమును జేయు నారకులను
సంఘవిద్రోహశక్తుల - చటుల మతుల -
హరిజనుల కాదుతాకరాదనుట నిజము,
వీణియలోని తంత్రులటు విశ్రుత మైనది భారతమ్ము, ఏ
కోణమునందు నున్న మది కోరికలూరగ మీటునేర్పు, వి
న్నాణము కావలెన్ జనమనమ్ములటుల్ కదలంగ రక్తి, ఆ
వీణియలోని తంత్రి యొక పెట్టున త్రెంప నపస్వరము లౌ.

హైందవ సమాజమున దీనికర్థ మేమి?
స్పృశ్యు లస్పృశ్యులను భేద సృష్టి యేమి?
మానవసమాజమెల్ల నెమ్మదిగ నుండ
వలయునన్న అస్పృశ్యత తొలగవలయు
వేద మంత్రమ్ములందు పవిత్ర రీతి
అమృత పుత్రులు మానవులనిరి కాని
కులమతమ్ముల వేర్పాటు తలపలేదు
అంటరాని దధర్మమే యనిరి ఋషులు.

ఆర్థికమ్ముగ నంత రాంతరమ్ములు లేక
సంఘమ్ము చరియించి సాగు టొకటి
కులమత ద్వేషముల్ కూలారునట్లుగా
సంఘమ్ము వర్తించి సాగుటొకటి

ఉన్నతోన్నత సౌధ మొకనికి, మఱి మట్టి
చెట్టునీడలను వసించు నొకడు
ఊళ్ళన్ని యేలంగ నొకనికి, మఱిబిచ్చ
మెత్తంగ నవ్వియే యింకొకనికి
ఒకడు పులిమీసలను బట్టి యూగులాడు;
గంజికరువయి యొక్కడు గింజులాడు:
ఒకడు స్వర్ణ డోలికలలో నూగులాడ
దుమ్ము ధూళుల నొక్కడు దొరలు టేమి !
భారతోద్యాన వాటిక పసిమి మిసిమి
పూవు లెన్నియొ పూచెను పొలప మొలయ
సుమములన్నియు పరిమళ శోభితములె
అంటరానివి కలవొకో అందుకొన్ని.

(29-9-80 న ఆకాశవాణి, విజయవాడలో ప్రసారితమైంది, ఆకాశవాణివారి సౌజన్యంతో).



# రాయలసీమ తెలుగు

-డా॥ హెచ్. యస్. బ్రహ్మానంద

0.1. భారతీయ భాషల్లో తెలుగుకి ఓ ప్రత్యేకత వుంది. అది ద్రావిడ భాషా వర్గాన్ని ఆర్యభాషా వర్గంతో కలిపే 'సంధి' ప్రాంతంలో 'ఆంధ్రదేశం' ఉండటం వల్ల ఏర్పడింది.[1] అందుకే ఆంధ్రులు అనార్యులా! ఆర్యులా! అన్న ప్రశ్నకు సందిగ్ధంగానే చారిత్రక భాషా పరిశోధకులు సమాధానం చెబుతున్నారు.[2] 'ఆంధ్ర' శబ్దం దేశ, భాషా వాచకం కంటే ముందు అందు 'జాతి' వాచకం. తెనుఁగు -దిగ్వాచి. తెలుఁగు, తెనుఁగు శబ్దానికి రూపాంతరం.[3] తెలుగుభాషా వ్యవహర్తలు ప్రధానంగా నాల్గు మండలాల్లో కేంద్రీకరింపబడ్డట్టు గుర్తించవచ్చు: అవి కళింగ, కోస్తా, తెలంగాణా, రాయలసీమ మండలాలు.[4] ఈ మాండలిక విభజన వృత్తిపదాల్ని ఆధారంగా చేసింది. చారిత్రకమైన స్పష్టవిభేదక లక్షణాలున్న ప్రాంతాలుగా వీటిని ప్రామాణికంగా వేరు చేయడం జరిగింది. ఈనాడు అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు రాయలసీమకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. ఈ వ్యాసం ఈ మండలంలోని తెలుగు భాషాస్వరూపాన్ని చారిత్రకంగా పరిశీలిస్తుంది.

1.0. రాయలసీమను ఇలా పిలవడానికి విజయనగర చరిత్రలో ఎక్కువ సంబంధం ఉన్న ప్రాంతం కావడం ఒక కారణం.[5] కాని ఈ ప్రాంతీయతను అంతకంటె ప్రాచీనతర దశలకు తీసుకుపోవడానికి వీలున్న చారిత్రక నిరూపణలు ఉన్నాయి. ఒకనాడు దక్షిణ భారత దేశమంతా రాయలసీమే. సేతువు నుండి అహమ్మదాబాదుదాకా. అటు కళింగదాకా రాయల కీర్తిపతాకం ఎగిరినంతమేరా ఒకపాలన కింద మెలగిన నేలగా చెప్పవచ్చు. కాని ఇక్కడ ఈ సీమను గురించి రెండు విలక్షణమైన భాషా ప్రమాణాల ద్వారా చర్చించడం జరుగుతుంది. ఆ ప్రమాణాలు కింద చూపబడ్డాయి.

1.1. ఇవి తర్వాత చర్చించబడతాయి :

(1) తొల్ కాప్పియంలో చెప్పబడ్డ ఉత్తరదేశ వ్యవహారం : వడచొల్—సంస్కృతమని కొందరు అర్థం చెప్పారు: తె. వడగు—(చూ. తొల్ కాప్పియం, ఎచ్చైవియల్. నూ.1)

(2) కర్ణాటక భాషా వైయాకరణులు భావించిన తెలుగన్నడం

(చూ. ఆ. భా. చ. సం. 1. పుటలు 43-

పై రెండు ప్రమాణాల్ని తెలుగు భాషా పరిణామ క్రమంలో సమన్వయించడంలో రాయలసీమ తెలుగు స్వరూపం కొంత అవగాహనకు రావడానికి వీలుంది.

1.2. తెలుగు భాషా ప్రాచీనత 3000 సంవత్సరాలని ప్రమాణ పరిశీలకుల నిర్ణయం.[6] అప్పటి ఆంధ్ర భాషా విస్తృతి ప్రాంతీయంగా ఎలా ఉండేదో నిర్ణయించడానికి చారిత్రకమైన శాసనాధారాలు తప్ప మరో మార్గంలేదు. ఒక భాషలో శాసనమో, కావ్యమో బయట పడటంతోటే భాష మొదలైందని చెప్పడం కుదరదు. అలాగే శాసన భాషలోని పదజాలాన్ని మాత్రమే ఆధారంగా సాహిత్య భాషా పూర్వ స్థితుల్ని స్థాపించడమూ అశాస్త్రీయ విషయం. అందుకే భాషలు-ఒక కుటుంబం లోనివి ఎప్పుడు వేరుపడ్డాయో చెప్పడానికి ధ్వనిపరిణామాలను ఒక సూచికగా అంగీ

కరించడం జరుగుతోంది. పదజాల నష్టాన్ని కూడా ఒక ప్రమాణంగా తీసుకోవడం ఉంది.[7]

1.3. క్రీ.శ. 6వ శతాబ్దిలో మొదటి తెలుగు శాసనం బైటపడింది. అంతకుముందు దక్షిణ దేశంలో అన్ని ప్రాంతాల్లో లాగానే తెలుగులో ఉన్నవీ ప్రాకృత శాసనాలే.[8] క్రీ. పూ. 1000 సంవత్సరాల నుంచి తెలుగు వ్యవహారంలో వుండి వుండాలి[9]. కాని ప్రత్యేకంగా తెలుగుభాష లేఖన దశకు వచ్చేటప్పటికిదాదాపు క్రీ.శ. 6వ శతాబ్దం అయింది. ఆనాటి ఈ 'రాయలసీమ' ప్రాచీన స్వరూప ఏమిటన్నది ప్రశ్న రాయలసీమ తెలుగు వికాసం అప్పటి నుంచి మనకు స్పష్టంగా తెలిస్తేనే గాని ఈ మాండలికం ఒక విలక్షణ వ్యవహారం ఎలా అయిందో నిర్ధారించలేం.

1.4. ఈ శతాబ్దంలోని భాషా పరిశీలకుల్లో తెలుగు భాషకున్న అంతప్రాచీనతను 'అనుమాన'ప్రమాణాన్ని ఆధారంగానైనా ఊహించి కొన్ని మౌలికమైన ప్రతిపాదనలు చేసినవారు. కీ.శే. చిలుకూరి నారాయణరావు గారు (1937) మళ్ళీ ఆ ప్రాచీనతను గురించి 'పదజాలం' ప్రమాణం ఆధారంగా ఊహించడానికి ప్రయత్నించినవారు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు (1981) మాత్రమే. రాయలసీమ ప్రాంతీయతను నిరూపించడంలో వీరి అభిప్రాయాలూ, మార్గాలు ఎంత వరకు సమంజసంగా ఉన్నాయో చూడ్డంతో ఈ ప్రాచీనతా స్వరూప నిర్దేశం జరుగుతుంది.

2. 1. నారాయణరావుగారి ప్రతిపాదనలు 'చరిత్ర, శాసనములు, ప్రాచీన గ్రంథప్రమాణములు'— వీటి నాశ్రయించినవి. ఈనాడు ద్రావిడ భాషలుగా పరిగణింపబడే భాషలన్నీ పైశాచీ ప్రాకృత వికారాలని ఆయన నిరూపించడానికి ప్రయత్నించారు.

"ద్రావిడ భాషలు ప్రాకృతములు కావనుకొనుటచే నార్యభాషలు వేఱనియు, ద్రావిడభాషల ప్రోద్బలము నార్యభాషలు ప్రాకృతములుగాను, నేఁటి యార్య భాషలుగాను బరిణమించినవని చెప్పుట సంభవించినది. ప్రాచీన ఇండో-అర్య భాషలుగా మాఱుటయని సొంత మార్గమునఁ బరిణమించుట చేతనైనను, ఇతరభాషల ప్రోద్బలము చేతనైనను కలిగియుండవచ్చును. నేటి పరిశోధకులు రెండవ కారణమును దెలుపుచు ద్రావిడ భాషల నార్యభాషల నుండి ప్రత్యేకించుచున్నారు. వారట్లు చెప్పుటకుఁ బ్రాచీన ప్రాకృత భాషలు ప్రచారమందున్న కాలమునకే ద్రావిడభాషలు నేటి రూపమున గాని తత్తుల్యమైన రూపమునగాని యుండెనని నిరూపింప వలసి యున్నది. ప్రాచీన ప్రాకృత భాషల కాలమునకు నేఁటి రూపమున ద్రావిడ భాషలుండెనని చూపుట కెట్టి నిదర్శనములును లేవు."[10]

(ఆ.భా.చ.సం.1.పుటలు 64-65)

ఉదాహరణకు, 'అచ్చతెనుఁగు' పదాలుగా భావింపబడ్డ పదాల్ని ఆయన ప్రాకృత భావాలుగా నిరూపించిన సన్నివేశాల్ని పరిశీలించవచ్చు.

అరి : ఇది హృత శబ్దభవము; ప్రాకృతమున 'హరి; హరిఅ' అని దీని రూపములు; పదాది హకారము లోపించి 'అరి' అయినది; 'హరింపబడినది, పన్ను, కప్పము; అనునర్థములఁదెనుగున రూఢియైనది. అల్లే లాగబడినది = వింటి నారి' అనునర్థము కూడ దానికి గలిగినది. అరిఁబోయు, అరికట్టు, అనుపదములందును 'హృ'ధాతువు గోచరించుచున్నది.

(ఆ.భా.చ.సం. 1 పుట

2.2 కృష్ణమూర్తిగారి పద్ధతి ఇది:

"If we want to know what Telugu culture was like 3000 years ago, the surest way is to look at the true native Telugu Vocabulary with a cleare knowledge of linguistic history and comparative method."

(1981 : P.4)

అచ్చమైన తెలుగు పదజాలం - కృష్ణమూర్తిగారి ప్రకారం తమిళ, మలయాళ,కన్నడ భాషల్లో తెలుగు

తోపాటు ధాత్వర్థ సాన్నిహిత్యం వుండి కనిపిస్తేనే అవుతుంది. అందువల్ల ఆయన DED (The Dravadian Etymological Dictionary, (ed) T Burrow & M B. Eneneau, oxford 1965)ని ప్రమాణంగా స్వీకరించారు. ఆయన కూడా ప్రాచీన తెలుగుల రాజ్యాంగ నిర్మాణాన్ని గురించి రాస్తూ

'అరి' అనే పదాన్ని (కప్పం, తెఅ) 'tax' అనే అర్థంలో గుర్తించారు. (P 5) ఇతర ద్రావిడ భాషల్లోనూ ఈ పదం వుంది కాబట్టి ఇది కేవలం ద్రావిడ భాషా పదమే అని నిర్ధరించవచ్చు—ఈ నైఘంటిక ప్రమాణాన్ని ఆధారంగా

(చూ. D.E D. 179)

2.3 పైన ఇద్దరు మహాపండితుల పరిశోధనలూ ఉదాహరించబడ్డాయి[11] నిర్ణయం పాఠకులకు వది లెయ్యవచ్చు. కాని ఈ శాస్త్ర వ్యాసంలో అలా చెయ్యడం లేదు, నాల్గు ద్రావిడ భాషలూ ఒకే 'Source' నుంచీ ఒక పదాన్ని గ్రహించే సందర్భం వుంటే, —పై 'అరి' ఉదాహరణంలో లాగా; ప్రాకృత పద సమన్వయం (relationship) వుంటే - అప్పుడు భాషా కుటుంబత్వాన్ని కేవలం పదాల్ని ఆధారంగా చెప్పడం కుదరదు. అప్పుడు ఒక పదం భాషలో కనిపించే 'నేపథ్యాన్ని' పంశీలించాలి 'Tax' పాలనకు సంబంధించింది. ఈ నాల్గు భాషల్లోనూ ఉన్న ఈ రూపం సమాన రాజకీయ వాతావరణాన్ని సూచిస్తోందని అర్థం. మరి భాషా కుటుంబ విషయం ఎలా అన్నది ప్రశ్న :

2 4. ఈ ప్రశ్నకు సమాధానంగానే ప్రాథమిక పదజాలాన్ని పండితులు సూచిస్తుంటారు బంధు వాచకాలు, దేహభాగ వాచకాలు ప్రాథమిక పదజాలంలో భాగంగా వుంటాయి. వీటిలో నిస్సందేహంగా ద్రావిడ భాషల ఏక కుటుంబిత స్థాపింపబడుతోంది. 'వాటిని పైశాచీ ప్రాకృతాలనటం వల్ల వచ్చే నష్టమే లేదు'—అన్న నారాయణ రావుగారి అభిప్రాయం సాంస్కృతిక రంగానికి సంబంధించింది మాత్రమే, ఈ లక్ష్మణాన్నే చింతామణికారుడు 'ఉపసర్పతి' అవడంలో సూచించాడు. ఈ అనుసరణ దక్షిణాత్య భాషల మౌలికతను స్థాపించేదే తప్ప—తిరస్కరించేది కాదు.

3.0. ఇప్పటి రాయలసీమ జిల్లాలు అప్పుడెలా ఉండేవన్న ప్రశ్నకు పై 1.1లో చూపిన ప్రమాణాలే నిదర్శనలు :

తెలుగు దేశంలో క్రీ.శ. 7వ శతాబ్ది దాకా తమిళ 'గ్రంథ' లిపితో కొన్ని శాసనాలు ధాన్య కటకం దాకా లభిస్తున్నాయి కడప మండలంలోనే మొదట తెలుగు లిపిలోని (తెలుగన్నడలిపి) శాసనం క్రీ. శ. 575 ప్రాంతానిది లభిస్తోంది.[12] బయటపడిన మొదటి ప్రాకృత శాసనం (క్రీ.పూ. 200) 'బ్రహ్మీలిపి' లో వుంది. ఈ సత్యాలను బౌద్ధమత వ్యాప్తి దృష్టితో ఆలోచిస్తే 'వడచాల్' అని తొల్ కాప్పియం పేర్కొన్నది. ధాన్యకటకం దాకా వున్న భాషా వ్యవహారాన్ని 'వడగు' అని తెలుగును సంగ సాహిత్యం వ్యవహరించడమూ, దీనికి ఉపపోషకమే కావాలి. అప్పటికే తెలుగుభాష స్వతంత్రంగా వ్యవహరించడంలో వుంది కాని ఈ తెలుగు-ఆత్యధిక తమిళ సాన్నిహిత్యాన్ని కల్గించి. అలాగే క్రీ. శ. 13వ శతాబ్ది దాకా ఒకే లిపితో సాగిన తెలుగన్నడాల పరిణామం కూడా ఇలాంటిదే. అనంతపురంలోని గ్రామనామాలు, వ్యక్తి నామాలు, కొన్ని ధ్వని పరిణామాలు, వ్యాకరణాంశాలు పొడుపు కథలు, పలుకుబడి — ఈ అంశాన్ని స్థాపిస్తాయి దీనికి ఉత్తర సరిహద్దు తెలంగాణా వ్యవహారమే.

3.1 తక్కిన కోస్తా, తెలంగాణా, కళింగల వ్యవహారాన్ని గురించిన ప్రత్యేకమైన మీ మాంస అవసరం కాని ఇక్కడ కొంత మాత్రమే సూచించడం జరుగుతుంది. 'అచ్చతెనుగు' కావ్యాలు మనకీ విషయంలో సహాయ పడుతున్నాయి.

3.2 కృష్ణాగోదావరుల మధ్యప్రాంతం 'అచ్చ'మైన ఆంధ్ర సంస్కృతిని ప్రదర్శిస్తుంది. అది అచ్చతెనుగు కావ్యాల్లోని పదజాలాన్ని ఆధారంగా అంటున్నమాట. ఈ పదజాలాన్ని పైశాచీ ప్రాకృత భావంగా నిరూపించడంలో ఉన్నసౌఖల్యం, మధ్య ద్రావిడ భాషల్లో జరిగే కొన్ని పరిణామాలు, ఈ పదజాలంలో కనిపించడం, రాయలసీమ ప్రజల వ్యవహారంలో ఈ నాటికీ అచ్చ తెలుగు పదాల వ్యవహారం చాలా తక్కువగా ఉండటం మనం ప్రమాణంగా తీసుకోవచ్చు. ఉదాకొరకు, ఈ వ్యాసకర్తకు పరిచయంలో లేని అచ్చతెనుగు పదాలివి.

ఎఱుగు = తెలియు (క్రి.)

క్రాలు = కదలు, ప్రకాశించు (క్రి)

పిసాళించు = ప్రకాశించు, వ్యాపించు, పరిమళించు, పరిహాసముచేయు, దొంగ ఎత్తు వేయు.

పోతుదు = పడచువాడు

కాదాని = బంగారము (భూ. అ. చ. సం. 1 505-521)

3.3 కేవలం రాయలసీమ వ్యవహారంలో మాత్రమే ఉన్నాయని చెప్పదగ్గ పదజాలం, వ్యాకరణాంశాలు ఇంతవరకే కీ. శే. నారాయణరావు గారు, శ్రీ శే. కల్లూరు నాగభూషణరావుగారు (1972) నిరూపించి ఉన్నారు. నాగభూషణ రావుగారు గుర్తించిన పదజాలంలో ముఖ్యమైనవి ఇవి.

| రా. సీ | కోస్తా |
|---|---|
| వాండ్లు | వాళ్ళు |
| అసులు (అసలు) | బురద |
| కందకాలు | పాతరలు |
| మోదాలు | మేఘాలు |
| పసులు | మొక్కలు |
| బయలాట, కిళిక | వీధిభాగవతం |
| బైకిలు (క) | వేవిళ్ళు |

మదక నాగల (1972 : పుటలు 10-70) వ్యాకరణాంశాలూ కొన్నిటిని ఆయన గుర్తించారు.

1. తాలవ్యీకరణం పొందని రూపాలు.

గేరి, కిర్నాలిక (శాసన రూపాలు కేసిన కేసిరి, పైకగ్ర కారయుక్త రూపాలు చారిత్రకంగా తెలుగులో జరిగి కిన్నడంలో జరగని తాలవ్యాకరణ ప్రక్రియను సూచిస్తున్నాయి.

2. భావర్థక - ఆటం - అడంలకన్నా - ఏ (ది) ప్రయోగం అధికంగా వుండటం.

వచ్చేది, తాగేది, పోయేది, తాగే -

3. తోడుకొని/తోలుకొని - మనుష్య వాచకాల తర్వాత రావడం. కోల్లిం తోల్కరావల్ల (అనంతపురం) కూతుర్నితోడుకొని పోయిందారు. (చిత్తూరు)

4. సమస్త క్రియా రూపాల్లో అనుబంధ క్రియా వైలక్షణ్యం సుమురు/నూనె పెట్టుకొన్నాడు (అనంతపురం, చిత్తురు. కడప, కర్నూలు)

సుమురు రాసుకొన్నాడు (ఇతర - ఆంధ్ర, తెలంగాణ)

కన్నడం : ఎణ్ణె ఇట్టుకొండ (త. మ. ల్లో కూడా ఇఱు ధాతువే వుంది)

5. బహువచనాంత ద్రవ్యావాచకాలలో క్రియ ఏకవచనంలో వుండటం.

కాఫీ బాగున్నాయి (కోస్తా) కాఫీ బాగుంది (రా. సీమ. క. క. త. మలరోలాగా)

టి బాగున్నాయి (॥)బా గుంది. (॥)

6. క్రియాంతంలో స్వాత్మ బోధక వి-మి- 0, లు లేకపోవడం.

నేను కుబ్బాయిని (కోస్తా) నేను పిల్లోడు (రా. సీ) వాళ్ళూ మేమూ బంధువులం (కోస్తా) వాండూమేమూ

బందుగులు (రా. సీ) త. మ. క. లో. ఇదేపద్ధతి (భూ. నాగభూషణరావు 1972 అవేపుటలు)

3.4. ఇంకా ఇటీవలి పరిశోధనలో రాయలసీమలో ఎనిపించే వాలక్షణ విభక్తి రూపాంతరాలు కొన్ని పరిశీలింపబడ్డాయి.

కోసరం - కోసం (కోస్తా (చూ. నారాయణరావు) నాగభూషణరావు.

మరొక విభక్తి రూపాంతరం లో లే- లకు సంబంధించింది.

ఇంట్లేకి రా ! ఇంట్లోకి రా !

(తో—తే 1-3) - ఈ పరిణామం పై నాల్గుజిల్లాల్లోనే కాకుండా నెల్లూరు ప్రాంతంలో దక్షిణ భాగంలో కూడా కనిపిస్తోంది రాయలసీమ వ్యవహార భేదక ఉచ్చారణంగా దీన్ని గ్రహించవచ్చు.

3. 4. 1. ఇలాంటి విలక్షణోచ్చారణలు మరి కొన్ని వున్నాయి.

రెడ్డి-రొడ్డి (క. రడ్డి ∠ రట్టగుడి ∠ రాష్ట్రికూట)

గెల - గొల (క. గొ. ళె)

రొట్టె - రొట్టి (హి. రొటీ)

ఇలా ఈ వ్యాసంలో నిరూపింపబడ్డట్లుగా రాయలసీమ తెలుగులో కనిపించే కన్నడ, తమిళ పఖావాలని భావింపబడే అంశాలను వడబోత తెలుగన్నడ లక్షణాలుగా పునర్వ్యాఖ్యానించడంలో రాయలసీమ భాషా ప్రాచీనతలు స్పష్టమౌతున్నాయి.

## జ్ఞాపికావివృత్తులు

1. 'ప్రాచీన ప్రకృత భాషలకిది తక్కువ ద్రావిడ భావలకంటె నెక్కువ దగ్గఱగా నుండుటయే ...... ఈ ప్రత్యేకమునకుఁగారణము'—చూ. నారాయణరావు ఆ. బా. చ. సం. 1, పుట. 75.
2. 'ఆంధ్రులు ఆర్య అనార్య మిశ్రజాతి '—చూ. జి. యన్. రెడ్డి, 1975 పుట. 9; కాని ఆంధ్రులు ఆనార్యులుకారని నారాయణరావుగారి ప్రతిపాదన. చూ. పై గ్రంథం. సం. 1, పుట 552.
3. చూ. జి. యన్. రెడ్డి. 1975, పుట 9.
4. Cf. Bh. Krishnamurti (1961)
5 'అనంతపుర చరిత్రయనగా విజయనగర చరిత్రయే' Cf Narayana Rao. Opcit, P 657.
6. Bh.Krishna murti, 'Telugu language and culture three thousand years ago,' (1981).
7. Bh. Krishnamurti says; 'According to Namboodiri (1976; 52) who applied glottochronology to south Dravidian, Telugu and Tamil separated in the 11th century B. C.; Tamil and Kannada said to have separated around the 2nd century B.C.; and Tamil and Malayalam around the 7th century D.A.' (1981; P 4)
8. See B. Radha Krishna (1975; P 51)
9. తెలుగు ప్రాక్ శాసన దశలో 1600 సంవత్సరాలు వ్యవహారంలో ఉండి ఉండాలని కృష్ణమూర్తిగారి ప్రమాణ నిర్ణయం. ఈ యుగంలోనే ప్రాకృతాలు దేశభాషలుగా పరిణమించి ఉండాలంటారు నారాయణ రావుగారు (చూ. The Brahmi Inscriptions of South India, 1938).

10. ద్రావిడ భాషల వల్ల ప్రాకృతాల్లో వచ్చినవని చెప్పబడే మార్పుల్ని ప్రాకృత భాషా సహజ లక్షణ పరిణామాలుగా వ్యాఖ్యానించ వచ్చనే నారాయణ రావుగారి అభిప్రాయంతోపాటు See. H. S. Ananthanarayana (1971 PP 1-20)

11 కృష్ణమూర్తి 'money' అనే అర్థాన్ని సూచించే దేశీయ తెలుగు పదం లేదన్నారు (P.9). డబ్బు (కోస్తా వ్యవహారం) దుడ్డు రా. సే. వ్యవహారం చూ. D E.D 2705). మొదటి హిందూస్థానీ ∠ప. నుంచి, రెండవది ప్రాకృతం నుంచి తెలుగులోకి ప్రవేశించాయని నారాయణరావు నిరూపణం (చూ. ఆ.బా. సం.1 పుటలు 498, 545, 599). ఇలాగే ఉంబళి(కం) అనే పదం (tax) దేశ్యమని నారాయణ రావుగారు చూ. D. E. D 549. కాని ఇటీవల చిదానంద మూర్తిగారు (1981) అశోకుని శాసన ప్రయోగం 'ఉబలికె' నాధారంగా సం. ఉద్బలి. ప్రా. ఉబ్బలి; ద్రావిడ భాషల్లో ఉంబలికె అయివుండాలని DED లోంచి ఇలాంటి పదాల్ని లేని వేయాల్సిన అవసరం వుందని వాదిస్తున్నారు. (చూ. ఉంబళి అథవా ఉంబటి వాగర్థ 1981లో. పుటలు (195&197)

12. చూ. బ్రహ్మానంద 'తెలుగన్నదం' (1977)

13. See. Brahmananda on Some Vowel Assimilation cases in Rayalasima (1981)

## రిఫరెన్సులు


Ananthanarayana H.S. : 'Prakrits and the Dravidian Languages; Pakhasanjan (1971)

Burrow, T. & Emeneau. M.B. 'The Dravidian Etymological Dictionary; (OVP 1961)

Krishnamurti, Bh. Telugu Language and cuture 8000 years Ago; XIAll India conference of Dravidian Linguists souvenir, O. U. Hyderabad (1981. PP. 1-10)

Namboodiri, E.V.N 'Glottochronology (as applied to four Dravidian Languages), Trivendrum, Sangama (1976)

Narayana Rao, C. 'The Brahmi Inscriptions of South India; New Indain Antiquary Vol. 1. (1988-39. 366-76)

కృష్ణమూర్తి, భద్రిరాజు మాండలిక వృత్తి పదకోశం; ఆ. ప్ర. సా. అ. పు. (1961)

(సం) 'తెలుగుభాషా చరిత్ర', ఆ. ప్ర. సా. అ. ప్ర (1975

నాగభూషణరావు, కె. రాయలసీమ మాండలికం; అనంతపురం ప్రాంతీయుత; DLA Pub. No, (1972)

నారాయణరావు, సి. 'ఆంధ్రభాషా చరిత్ర' (2 సం.) ఆంధ్ర విశ్వకళా పరిషత్తు. ప్ర. వాల్తేరు (1937)

బ్రహ్మానంద, హెచ్. ఎస్. 'తెలుగన్నడం', ప్రవంతి 23-12, PP33-37 (1977)

,, 'రాయలసీమలో కొన్ని విలక్షణ ఆచ్ సమీకారణాలు-ఒక పరిశీలన' (ఆంగ్లంలో, తెలుగులో అను. 1981)

రాధాకృష్ణ, బూదరాజు. 'ప్రాచీనాంధ్రం; శాసనభాషా పరిణామం' భ. కృష్ణమూర్తి (సం) (1975) పుటలు 51-101

రెడ్డి, జి. యన్. 'ఆంధ్రం, తెనుగు, తెలుగు', భ. కృష్ణమూర్తి (సం) (1975) పుటలు 1-14

చిదానంద మూర్తి, ఎమ్. 'వాగర్థ (కన్నడంలో) BAPPCO. Pub-(1981)

# సాంస్కృతిక సాహిత్య రంగాల వికాసానికి పాశ్చాత్యుల దోహదం

— ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

తెలుగు భాష నేర్చుకొన్న పాశ్చాత్యుల్ని స్థూలంగా మూడు తరగతులుగా విభజించవచ్చు మతప్రచారం కోసం తెలుగు నేర్చుకొన్న వాళ్ళు, భాషా సాహిత్యాల మీద ఉన్న అభిమానంతో తెలుగు నేర్చుకొన్న వాళ్ళు భాషా సాహిత్యాల మీద ఉన్న అభిమానంతో తెలుగు నేర్చుకొన్న వాళ్ళు అనేవే ఆ మూడు తరగతులూను. మొదటి తరగతిలో మిషనరీలు మొదలయిన వాళ్ళంతా వస్తారు. తెలుగులో విద్వాంసులయినవాళ్ళు వీళ్ళలో కొందరున్నా వీళ్ళ దృష్టి మతప్రచారం. భాషా సాహిత్యాలకు సేవ చేద్దామనే భావం తక్కువ. వీళ్ళ వల్ల ఎక్కడైనా కొంత సేవ జరిగితే జరిగివుండ వచ్చు. అది వాళ్ళ లక్ష్యం కాదు. ఉద్యోగ ధర్మాన్ని అనుసరించి తెలుగు నేర్చుకొన్నవాళ్ళలో చాలామంది వాళ్ళ పనికి కావలసినంత మాత్రంగానే కృషిచేసిన వాళ్ళు. ప్రత్యేకంగా తెలుగులో కృషిచేసి ఆ భాషా సాహిత్యాల్ని ఉద్ధరిద్దాం అనే దృష్టి వీళ్ళలోనూ తక్కువే. ఆరోజుల్లో కంపెనీ ఉద్యోగంలో ఉన్న పాశ్చాత్యు లందరూ ఇంచుమించుగా వాళ్ళ వాళ్ళ ప్రాంతాల్లో వాడుకలోఉన్న భారతీయ భాషల్ని నేర్చు కొన్నవాళ్ళే తెలుగు ప్రాంతంలో పనుల్లో ఉన్నవాళ్ళు తెలుగు నేర్చుకొన్నారు. వీళ్ళల్లో కొందరు ఉద్యోగ ధర్మాన్ని అనుసరించి తెలుగు నేర్చుకొని. అంతటితో తృప్తిపడక తమకు సహజమైన భాషాభి మానం పురిగొల్పగా తెలుగు అభివృద్ధికోసం రేయింబవళ్ళు శ్రమించిన వాళ్ళున్నారు. వీళ్ళవల్లే తెలుగు భాషాసాహిత్యాలకు బాగా సేవ జరిగింది. ఆ సేవ, తెలుగువాళ్ళ సాహిత్య సాంస్కృతిక రంగాల వికాసానికి దోహదం చేసింది. ఇంక మూడో తరగతికి చెందిన పాశ్చాత్యులందరూ భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, రాజకీయాది కారణాల వల్ల భారతీయ భాషల్లో కృషిచేసినవాళ్ళు వీళ్ళువాళ్ళ దూతావాసాల్లో పనులు చేసేవాళ్ళు. విశ్వవిద్యాలయాలకి చెందిన ఆచార్యులూ, విద్యార్థులూ పత్రికలవాళ్ళు, ప్రచురణాలయాల్లో పనులుచేసేవాళ్ళు ఇతరులు ఉన్నారు.

మిషనరీల వల్ల ఇంచుమించుగా అన్ని భారతీయ భాషలకు జరిగిన ఏకైక ఉపకారం ముద్రణ సౌకర్యం మత గ్రంథాల్ని అచ్చువేయించడం కోసం వీళ్ళందరూ మొట్టమొదటిసారి భారతీయ భాషలకు ముద్రణ సౌకర్యం కల్పించారు. ఇందువల్లనే ఇంచు మించుగా అన్ని భారతీయ లిపుల్లోను మొట్టమొదట అచ్చయిన పుస్తకాలు క్రైస్తవ మతానికి సంబం ధించినవే. వీటితోబాటు ఆయా భాషల వ్యాకరణాలు, నిఘంటువులు వచ్చాయి. మొట్ట మొదట్లో ఈ కృషి కంతటికీ గమ్యస్థానం మతప్రచారమే అయినా, ముద్రణ వ్యాప్తివల్ల భారతీయ భాషల అభివృద్ధికి, తరువాత తరువాత చాలాలాభం చేకూరింది ఈ సందర్భంలో ఒక్క ఉదాహరణాన్ని తీసుకోవచ్చు. శ్రీ రామపురం దీనినే సెరంపూర్ అనడం ఉంది-

మిషన్‌కి చెందిన డా విలియం కెరే, 19వ శతాబ్ది మొదటి పది సంవత్సరాల్లోనే ఇంచుమించుగా అన్ని భారతీయ లిపులకూ అక్షరాలు తయారుచేయించి వాటితో ఆయా భాషలో ముద్రణ ప్రారంభించాడు. ఈ అక్షరాల్ని పోతపోయడంలో, పౌండ్రీని స్థాపించ డంలో ఒక భారతీయ లోహకారుడు సాయంచేశాడు. ఇక్కడే 1801 లో బెంగాలీ క్రొత్త నిబంధన గ్రంథం (న్యూటెస్టమెంట్) అచ్చయింది ఇక్కడే 36 భాషల్లో క్రొత్త నిబంధన అచ్చయిందట. ఈ భాషల్లో పఠాన్లు మాట్లాడే పష్తు కూడా ఉందంటే ఆ ముద్రణోద్యమ విస్తృతి తెలుస్తుంది. వీటితోబాటు ఆయా భాషల వ్యాకరణాలు కూడా అచ్చయ్యాయి. మరాఠి వ్యాకరణం 1805 లోను, సంస్కృత వ్యాకరణం 1806లోనూ, పంజాబి వ్యాకరణం 1812 లోనూ, తెలుగు వ్యాకరణం 1814లోనూ వచ్చాయి అంటే, ఆ కృషి విలువ తెలుస్తుంది ఐతే భారతదేశం పశ్చిమతీరంలో పోర్చుగీసువాళ్ళకృషి వల్ల 1556 నాటికే గోవాలో పుస్తకాలు అచ్చవడం ప్రారంభమయింది. మన తెలుగు ముద్రణ కొంత ఆలస్యమయినా, మన ముద్రణ 1746-47 నాటి నుంచి ప్రారంభమయింది. ఇది అనాటి ప్రపష్యాదేశంలో అచ్చయిన క్రైస్తవ మత గ్రంథంతో ప్రారంభ మయింది. తరువాత పుంఖాను పుంఖాలుగా మన దేశంలోనే పుస్తకాలుగా అచ్చయి, గురుముఖతా విద్య నేర్చుకోవడమనే సంప్రదాయం సన్నగిల్లి సమాజంలో నర్వులూ విద్య నేర్చుకోవడానికి ఆస్కారం కలిగి, సాహిత్య సాంస్కృతిక రంగాల్లో విప్లవాత్మకమయిన మార్పులకు అవకాశాలు కలిగాయి.

తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలకు పరో క్షంగా సేవచేసిన పాశ్చాత్యుడు కల్నల్ కాలిన్ మెకంజి భారతదేశానికి సర్వేయర్-జనరల్‌గా పని చేసిన మెకంజి దేశమంతా తిరుగుతూ తన పండితుల చేత శాసనాలు, నాణాలు స్థానిక చరిత్రలు, చిత్రాలు, శిల్పాలు సంగ్రహింపజేస్తూ సాహిత్య సాంస్కృతిక రంగాలకు పనికివచ్చే సామగ్రి సిద్ధం చేశాడు. తెలుగు వాళ్ళయిన కావలి సోదరులు ఈ మహా కృషిలో ఆతనికి తోడ్పడ్డారు వీళ్ళల్లో కావలి వెంకట బొర్రయ్య అనన్య సామాన్యమయిన ప్రతిభతో తనకు సాయపడినట్టు మెకంజీయే వ్రాశాడు. మెకంజీ అనంతరం ఆతడు సేకరించిన పత్రాల్ని శిథిలమవుతూవుండే సి. పి. బ్రౌన్ తిరిగి మంచి కాగితాల మీద వ్రాయించాడు. ఇవే స్థానిక చరిత్రలుగా పేరుపొందాయి.

పాశ్చాత్యులు, తెలుగు అనగానే బ్రౌన్ పేరు జ్ఞాపకం రాని చదువుకొన్న తెలుగు వాడుండడు. సుదీర్ఘమైన తన 86 సంవత్సరాల జీవితకాలంలో ఇంచుమించుగా 65 సంవత్సరాలు తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికి అర్పణ చేశాడు ఈ మహాను భావుడు. మనదేశంలో ఉన్నా ఇంగ్లండులో ఉన్నా, ఆరోగ్యంగా ఉన్నా అనారోగ్యంగా ఉన్నా, డబ్బున్నా డబ్బుకి ఇబ్బంది పడుతున్నా తన కృషి మాత్రం మానలేదు బ్రౌన్. అనేక ఉద్యోగాలు చేస్తూ మనదేశ మంతా తిరిగినా, ఒక విధంగా చూస్తే ఈయన కృషికి కేంద్రం కడప. ఆయన ఇల్లు. బ్రౌన్‌గారి కాలేజి అని పేరుపొందింది. ఆనాటి పండితులందరి గౌరవ మర్యాదల్ని చూరగొన్న బ్రౌన్ అందరిని ఆదరించి వాళ్ళకు నాయకత్వం వహించి మరుగుపడిన ఆంధ్ర సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చాడు. నిఘంటువులు, వ్యాకరణాలు, ఇతర శాస్త్ర గ్రంథాలు వ్రాసివాటిలో గొప్ప కృషి చేసినా - వాటిఉపయోగానికి కొంత పరిమితత్వం ఉంది. అపరిమితమయిన ఉపయోగం తెలుగు ప్రజలకు ఈయన తెలుగు కావ్యాల్ని వెలుగు లోకి ముద్రణ ద్వారా తీసుకురావడం వల్ల కలిగింది. ఇప్పుడు తెలుగువాళ్ళు చదువుకొని ఆనందిస్తూ ఉన్న ప్రతి కావ్యం ఆయన సేకరించి పండితుల చేత ప్రతులు వ్రాయించి సిద్ధం చేయించిందే. కొన్నింటిని సంస్కరించి ముద్రించాడు. కొన్నింటిని సంస్కరించి

ముద్రించాడు. కొన్నింటిని అచ్చుకు సిద్ధంచేసి ఉంచాడు. తనకు తెలుగువాళ్ళు వ్రాసిన, తాను వాళ్లకు వ్రాసిన వందలాదిజాబుల్ని పదిలంగా శ్రద్ధపరిచి నాటి సాంస్కృతిక సామాజిక జీవనాన్ని తెలుసుకోవడానికి సామగ్రిని సిద్ధం చేశాడు. జానపద సాహిత్యాన్ని, సామెతల్ని సేకరించి ఉంచాడు. సొంతడబ్బుఖర్చుపెట్టి పండితులకు జీతాలిచ్చుకొని సాహిత్య సేవ చేశాడు. పుస్తకాల్లో అన్ని సాహిత్య శాఖలకు సంబంధించిన వానిఅవి శతటికాలైనా, పురాణాలైనా, ప్రబంధాలైనా సమానంగానే ప్రేమించి కృషి జరిగించాడు,

వేమన పద్యాల్ని ఆంగ్లానువాదంతో 1829 లో అచ్చువేశాడు. ఇంతకముందే 1827 లో ఆంధ్ర గీర్వాణ ఛందము — తెలుగు సంస్కృత భాషల నుండి ఉదాహరణలిస్తూ ఆంగ్లంలో వ్రాసి ముద్రించాడు మహాభారతంలోంచి కొన్ని పద్యాల్ని ఇంగ్లీషు అనువాదంతో సహా దీనిలో ముద్రించాడు. మహాభారత ముద్రణాన్ని 1840లోనే ప్రారంభించాడు ఆదిపర్వం 1842లోనే వచ్చింది. 1827 లో బ్రౌను సిద్ధంచేయించిన ప్రతిని ఆధారంగా చేసుకొని 1848లో పురాణం హయగ్రీవశాస్త్రి పోతన భాగవతాన్ని ముద్రించాడు. బ్రౌన్ పండితులచేత టీకలు వ్రాయించి ప్రబంధాల్ని ముద్రించాడు. ఈటీకా కారుల్లో జూలూరు అప్పయ్య ప్రసిద్ధుడు. 1844లో వసుచరిత్ర' 1851లో మనుచరిత్ర టీకలతో అచ్చయ్యాయి. ఇలా ఇంకా ఎన్నో పుస్తకాలు. ఈ కృషిలో బ్రౌన్‌కు సాయపడిన పండితుల్లో - తిప్పాభట్ల వెంకట శివ శాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి, ములుపాక బుచ్చయ్య శాస్త్రి, గరిమెళ్ళ వెంకయ్య, పైడిపాటి వెంకటనరసయ్య, కంభం నరసింహాచార్యులు మొదలైనవాళ్ళున్నారు. పాండిత్య విషయాల్లో ఈ పండితుల సాయం లభించినట్లే, భౌతిక విషయాల్లో బ్రౌన్‌కి అయోధ్యాపురం కృష్ణారెడ్డి సాయంలభించింది' తన ప్రభుత్వోద్యోగం తాను చేసుకొంటూ బ్రౌన్ కాలేజికి కృష్ణారెడ్డి-ఆధునిక పరిభాషలో చెప్పాలంటే- అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా వేతనం లేకుండాపనిచేశాడు. బ్రౌన్, ఇతర కార్యకలాపాలకు ఈయన దివాన్‌లా వర్తించాడు. ఇందరికి నాయకత్వం వహిస్తూ బ్రౌన్ తెలుగువారి సాహిత్య సాంస్కృతిక పునరుజ్జీవనానికి చక్కని దోహదం చేశాడు.

బ్రౌన్‌ని ప్రక్కని నిలబెట్టి చెప్పడానికి తగిన కృషి చేసిన యింకో పాశ్చాత్యుడు మనకి కనబడడు పాక్షికంగా కృషి చేసిన కాంబెల్, మారిన్ సోదరులు, ఆర్డెన్ మొదలైనవాళ్ళు కొందరున్నారు.

20వ శతాబ్దిలో తెలుగు భాషా సాహిత్యాల కృషి అమెరికా, రష్యా మొదలైన దేశాల్లో జరుగుతోంది. ఆయా దేశాల్లోని విశ్వవిద్యాలయాలు ఈ కృషికి చాలా సాయం చేస్తున్నాయి. గెరాల్డ్ కెల్లి మొదలైన వాళ్ళ కృషి భాషమీద, ఫ్రైకెన్‌బర్గ్ మొదలైనవాళ్ళ కృషి చరిత్ర మీద కేంద్రీకృతమయి. వున్నాయి. జాన్‌లేనార్డు కందుకూరి వీరేశలింగం మీద ఎస్తైల్ స్త్రీజాక్ ఆధునిక కవిత్వం మీద గణనీయమయిన కృషి చేశారు.

రష్యాలో తెలుగు భాషా సాహిత్యాల మీద మంచి కృషి జరుగుతోంది. వ్యాకరణాలు నిఘంటువులు వచ్చాయి. మాస్కో, లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయాల్లోనే కాక ప్రోగ్రెస్ ప్రచురణాలయంలోను తెలుగులో లోతైన కృషిచేసినవాళ్ళున్నారు. పెత్రునిచెవ, గురోవ్, స్వెత్లానా, వోలా మొదలైన వాళ్ళకృషి గణనీయంగా ఉంది. గురజాడవారి కన్యాశుల్కం అనూదితమయింది. 1978లో తెలుగు కథలు అనే కులు వ్రాసినవి - 'గరోదక్‌మయి', సిరివద, అనే పేరుతో అనువాదరూపంలో వచ్చాయి. ఈ సంపుటిలో చెలిషెవ్ వ్రాసిన ఉపోద్ఘాతం ఉంది. అందులో తెలుగువాళ్ళ చరిత్ర, సాహిత్య చరిత్ర లఘువుగా ప్రస్తావితాలయ్యాయి. మధురాంతకం రాజారాం కథతో ప్రారంభమయిన ఈ సంపుటిలో చలం, తిలక్, పెద్దిభట్ల సుబ్బరామయ్య, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు మొదలైన వాళ్ళ కథలున్నాయి. ప్రోగ్రెస్ ప్రచురణాలయం దీన్ని ప్రచురించింది,

ఈ విధంగా పాశ్చాత్యుల కృషి తెలుగువాళ్ళ సాహిత్య సాంస్కృతిక రంగాల వికాసానికి దోహదం చేస్తున్నది. పరస్పరం ఇచ్చిపుచ్చుకోవాలే ఉత్తమ సంస్కారానికి చిహ్నం గదా !

(-ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంనుండిప్రసారితం)

# తెలుగు నిఘంటు నిర్మాణంలో పాశ్చాత్యుల కృషి

—డా॥ రాధాకృష్ణ

ఏ భాషలోనైనా వ్యాకరణశాస్త్ర పరిశోధన ఫలితంగా సిద్ధమైన నిఘంటువుగాని, నిఘంటు నిర్మాణ ఫలితంగా వచ్చిన వ్యాకరణశాస్త్ర గ్రంథం గాని ప్రామాణికంగా వుంటాయి. తెలుగు నిఘంటువులు నిర్మించిన, నిర్మించటానికి తోడ్పడిన పాశ్చాత్యులందరూ తెలుగు వ్యాకరణంలో పరిశ్రమించినవారు కారు. అలా పరిశ్రమించినవిలియం బ్రౌన్, కాంబెల్, స్వెత్లానా.పెత్రునిచెవా గురోవ్‌ల తెలుగు నిఘంటువులు ప్రామాణిక గ్రంథ-కోటిలో చేర్తాయి.

తెలుగు నిఘంటు నిర్మాణంలో కృషి చేసిన పాశ్చాత్యులను మూడు విధాలుగా వర్గీకరించవచ్చు. ఒకటి, ద్విభాషా నిఘంటు నిర్మాణం స్వయంగా చేసినవాళ్ళు, రెండు, అనేక భాషా నిఘంటువులు సిద్ధపరుస్తూ వాటిలో తెలుగు భాషకు కూడా స్థానమిచ్చిన వాళ్ళు, మూడు, తెలుగు నిఘంటు నిర్మాణంలో తోడ్పడే విషయ సామగ్రి సమకూర్చినవాళ్ళు. కాలక్రమపద్ధతిలో వరసగా ఆయా విధాల కృషిచేసిన పాశ్చాత్యులనూ, వారి గుణదోషాలనూ స్మరిద్దాం.

సుమారు క్రీ.శ. 1700 ప్రాంతంలోనే ఫ్రెంచి మిషనరీలు ఒక తెలుగు ఫ్రెంచ్ నిఘంటువును సిద్ధం చేశారనీ, దాని పేరు అనీ, 1856లో దాన్ని చూశాననీ, అందులో వెయ్యికి పైగా తెలుగు పదబంధాలున్నట్లూ సి.పి. బ్రౌన్ చెప్పారు. దాని నిర్మాత ఎవరో తెలియదు. ఇప్పుడా నిఘంటువు దొరకటంలేదు. లభిస్తున్న వాటిలో అకారాదిక్రమంలో, ఇంగ్లీషర్థాలతో 1817-18లో విలియం బ్రౌన్ ప్రచురించిన తెలుగు నిఘంటువే మొదటిది. దీనికి 1948లో పునర్ముద్రణ భాగ్యం పట్టింది. ఇంగ్లీషు ఉద్యోగులు తెలుగు నేర్చుకోవటానికి ఒక వ్యాకరణం రాసిన విలియం బ్రౌన్ నిఘంటువు కూడా నిర్మించాడు. ఆ తరువాత 1821లో ఎ. డి. కాంబెల్ నిఘంటువు అచ్చయింది. అందులోని ఆరోపాలూ, అర్థాలూ రోమన్ లిపిలోనే వున్నాయి. ఒకనాటికి తెలుగు అధికార భాష అయితే ఎన్నో ఇంగ్లీషు పదాలను తెలుగులో చేర్చుకొనివాడక తప్పదని ఆనాడే సూచించిన విజ్ఞత కాంబెల్‌దే. 1830 ప్రాంతంలో Batzeill అనే మిషనరి ఒక తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు నిర్మించగా అప్పటి కాలేజీ బోర్డు వారు అది ప్రచురణయోగ్యం కాదన్నారని తెలుస్తుంది. అదే కాలంలో, జెంతూ, నిఘంటువొకటి పోర్చుగీసు పండితుడొకడు సిద్ధం చేసినట్లూ, అందులో వ్యావహారిక రూపాలకే స్థానమిచ్చినట్లూ తెలుస్తున్నదిగాని అదికూడా దొరకటం లేదు. పోర్చుగీసువారు తెలుగువారిని 'జెంతైల్' అని పిలిచేవారు. మన భాషను 'జెంతూ' అనేవారు. 'సాధువుల భాష' అని ఆ మాటకు అర్థం. Gentil అనే ఇంగ్లీషు మాటను యిక్కడ అనుసంధించుకోవాలి. 1835 లో జె. సి. మారిస్ రచించిన నిఘంటువు కాలేజీ బోర్డు వారే ప్రచురించారు. ఇవన్నీ ఒక ఎత్తు. సి. పి. బ్రౌన్ పరిశ్రమ మరో ఎత్తు.

నిఘంటువు పేరెత్తగానే తెలుగువారికిగాని, తెలుగు తెలిసిన పాశ్చాత్యులకుగాని వెంటనే స్ఫురించే పేరు చార్లెస్ ఫిలిప్ బ్రౌనుది. ఆయనపై అనేక గ్రంథాలు వచ్చాయి. చాటుపద్యాలున్నాయి. 1852లో తెలుగు-ఇంగ్లీషు నిఘంటువును ప్రచురించిన సి. పి. బ్రౌన్ మరుసటేడు ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు ప్రచురించాడు. 42 వేల పదాలకు పైగా ఉన్న ఈ తెలుగు-

ఇంగ్లీషు నిఘంటువును 1904లో కందుకూరి వీరేశలింగం, యం. వెంకటరత్నం, డబ్ల్యు. హెచ్. కాంబెల్ పరిష్కరించి పునర్ముద్రించారుగాని మొదటి ప్రచురణకున్న ప్రామాణ్యం దీనికి రాలేదు. తెలుగు వారికి సుపరిచితమైన శంకరనారాయణ నిఘంటువులు బ్రౌన్ నిఘంటువుల మూసలో తయారైన బ్రౌణ్యానికున్న ప్రామాణ్యం వీటికి రాలేదు. తెలుగు వారు బ్రౌణ్యానికి ప్రామాణ్యమిస్తే పాశ్చాత్యులు శంకరనారాయణ నిఘంటువులను గౌరవిస్తుంటారు. బ్రౌణ్యంలో లాగ పదప్రయోగాలు, పదబంధ సౌష్ఠవాలు వివరణలు మరో నిఘంటువులో లేవు. అందువల్లనే సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు కూడా బ్రౌణ్యానికి చిన్నయసూరి నిఘంటువు కిచ్చినంత ప్రామాణ్యమిచ్చారు. తాను రాసిన 'తెలుగు రీడర్'కు అనుబంధంగా సి పి. బ్రౌన్ Little Lexicon అనే పేరుతో మరో చిన్న నిఘంటువు నిర్మించాడు. 1852 లోనే ఆయన సిద్ధంచేసిన 'The Zilla Dictionary' 1855లో విల్సన్ పదకోశంలోభాగమైపోయింది. ఆయేదే ఆయన నిర్మించిన 'మిశ్ర భాషా నిఘంటు' తెలుగులో చేరిన అన్య దేశ్యాలను వివరిస్తుంది. పరుష సరళాలను కలిపి ఏకక్రమంలో యివ్వడం, అకర్మక క్రియకు పాతకాలపు పరిభాష grenter వంటి పదాలు వాడటం వంటివి ఈనాటి వారికి బ్రౌణ్యంలో ఎబ్బెట్టుగా కనిపించినా సి. పి బ్రౌన్ నిఘంటువులకున్న ప్రామాణ్యం అచుంచితమని చెప్పవచ్చు. ఆయన వ్యావహారిక భాషా రూపాలకు ప్రామాణ్యం కల్పించాడు. విస్తృతిలో చిన్నదైనా పాశ్చాత్యులు తెలుగు నేర్చుకోవటంలో బాగా ఉపయోగపడే మరో నిఘంటువు Galletti నిర్మించిన A Dictionary of Current Telugu వ్యావహారిక రూపాలకు ప్రామాణ్యమిస్తూ 1935 లో ఈ నిఘంటువు వెలుగుచూసింది.

1972 లో డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు సంపాదకులుగా, స్వెత్లానా జెనిత్, పి. హెచ్. జి. పెత్రునిచెవా, నికితా గురోవ్‌లు సంకలన కర్తలుగా తెలుగు-రూస్కియ్ సవార్ అనే తెలుగు రష్యన్ నిఘంటువు వెలువడింది పరిమాణంలో యిది సి. పి. బ్రౌన్ నిఘంటువంతటిదే గాని యిందులో గ్రాంథిక రూపాలకు ఎక్కువ స్థానం యిచ్చారు. పదప్రయోగ వివరణలు తక్కువ. యివన్నీ మొదటి వర్గానికి చెందిన నిఘంటువులు.

అన్యభాషా పదాలతోబాటు తెలుగు పదాలకుగూడా ఆరోపత్యమిచ్చిన బహుభాషా నిఘంటువులు కొన్ని పాశ్చాత్యులు నిర్మించారు. 1955 లో వెలువడిన హెచ్. హెచ్. విల్సన్ నిర్మించిన Glossary of Judial and Administrative terms లో అనేకానేక తెలుగు పదాలకు విపులమైన అర్థవివరణ లభిస్తుంది. పరిపాలన న్యాయ వ్యవహారాలకుమాత్రమే పరిమితమైన తెలుగు మాటలు ఇందులో ఉన్నాయి. Bandicoof, Baudy, tape, mangoose. chatty, వంటి మాటలు తెలుగులో నుంచి ఇంగ్లీషులో చేరినట్లు వివరిస్తూ వాటి అర్థనిర్ణయం చేసిల యిద్దరు పాశ్చాత్యులు ప్రచురించిన Hobson jobson అనేది దీని ప్రయోజనం చాలా పరిమితం. నాలుగు వేల పై చిల్లర తెలుగు పదవర్గాల వ్యుత్పత్తులను. మరి ఇరవయ్యొక్క ద్రవిడభాషా పదాల వ్యుత్పత్తులను తోబాటు వివరించే ప్రశస్త నిఘంటువు A Drividian Etumological Dyicionary 1961 లో ఆక్స్‌ఫర్డ్‌లోని థామస్ బరో, కాలిఫోర్నియాలోని M B Emerieau అనే ఇద్దరు మహా విద్వాంసులు అని వ్యవహరించే ఈ మహానిఘంటువు ప్రచురించారు. 1968లో దీనికొక అనుబంధం ప్రచురించారు. తెలుగులో భాషా పరిశోధకులకు యిది కల్పతరవు.

బ్రౌణ్యంవంటి మహా నిఘంటువులకే కాక ఇప్పటి వృత్తిపదకోశాల సంకలనంలో కూడా ఎంతో ఉపయోగపడుతున్న ఇతర కోశ గ్రంథాలు చాలా

ఉన్నాయి. వాటిలో ముఖ్యంగా చెట్లు చేమలకు, పశు పక్ష్యాదులకు తెలుగు భాషలో భిన్న ప్రాంతాల్లో వాడుకలో ఉన్న పర్యాయపదాలు అనేకం దొరుకుతాయి. అవి చాలా వరకు పాశ్చాత్య పండితులు లోక సంచారం చేసి సమకూర్చిపెట్టినవే. ఈ కోశగ్రంధాలు మూడోవర్గానికి చెందినవి. ఇవి నిఘంటు నిర్మాతలకు సహాయక గ్రంథాలన వచ్చు. 1811-17 లో Russels రాసిన Indian Serpents. Fishes' అనే కోశంలో చాలా తెలుగుమాటలున్నాయని సి.పి. బ్రౌన్ పేర్కొన్నాడు. 1828 లో కావలి బొర్రయ్య సహాయంతో Colnel Collem Markenzia సేకరించగా Revernd william Taylor అనే మిషనరీ 570 పేజీల కేటలాగుగా 1886 లో సిద్ధం చేసిన వివరాలను సి. పి. బ్రౌన్ స్థానిక చరిత్రలనే పేరిట 62 సంపుటాలుగా రాయించారు. మెకంజీ కైఫీయతులను వ్యవహరించే ఈ గ్రంథాలు చరిత్ర. పరిశోధకులకూ, భాషా పరిశోధకులకూ బంగారు గనుల్లాంటివి. నిఘంటు నిర్మాతలకివి కాణాచులు. 1832లో విలియం రాక్స్బర్గు రాసిన మూడు సంపుటాల 'Flora Indiea, 1875 నుంచి 1897 వరకు ఏడు సంపుటాలుగా J. D. Hooker ప్రచురించిన The Flera of British India అనే కోశాలు వందల సంఖ్యలో చెట్ల పేర్లకు తెలుగులో ఉన్న స్థానిక పదాలను వివరిస్తాయి. ఇటు వంటివే మరికొన్ని. Bentley, Herry లు 1880 లో ప్రచురించిన నాలుగు సంపుటాల Meheral Plants, 1889-1896 మధ్యకాలంలో George Watt ఆరు సంపుటాలుగా ప్రచురించిన A diction ary Economic products, of India 1915 లో A. W. Lushirgth ప్రచురించిన రెండు సంపుటాల Vernailar list of trees, Shrubs, and woody climbers in the Madras presideney 1932 లో P.F. Fyson ప్రచురించిన The Flora of South Stalics ఈ కోవకు చెందినవే. 1957 లో J. S. Ganubble నిర్మించిన Flora of presidency of Madras' అనే కోశం రెండు సంపుటాలూ, E C. Cecil Fisher రచించిన మూడో సంపుటమూ పునర్ముద్రితమైనాయి. ఇవన్నీ తెలుగులో మహా నిఘంటువు నిర్మించటానికి ఎన్నోవిధాల ఎంతో తోడ్పడే విధంగా పాశ్చాత్యులు నిర్మించిన పదకోశాలే ఈ పండితులందరిలోనూ ప్రాతస్మరణీయుడు సి. పి. బ్రౌన్.

(— ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారితం)

# పాశ్చాత్యుల తెలుగు వ్యాకరణాలు

—డా॥ చేకూరి రామారావు

విదేశీయులు రాకముందున్న తెలుగు వ్యాకరణాలు భారతీయ సంప్రదాయానుసారంగా వచ్చినవి. యివి ప్రధానంగా సంస్కృత వ్యాకరణాల ననుసరించినవి. ఆంధ్రశబ్ద చింతామణి నుంచి వజ్ఝమూడి గోపాల కృష్ణయ్య గారి వ్యావహారిక భాషా వ్యాకరణం వరకు ఒక మూసలో నుంచి వచ్చినవే. వీటిలో పదరూప నిష్పాదన కిచ్చినంత ప్రాముఖ్యం పదసంయోజన కియ్యలేదు. సమాసపరిచ్ఛేదం ఉన్నా దాని పరిధిచాలా చిన్నది. సంధి సూత్రాలు ఈ వ్యాకరణాలన్నిట్లోనూ ప్రధానంగా కనిపిస్తాయి. చెప్పినా చెప్పకపోయినా ఈ వ్యాకరణాలన్నీ గ్రంథ రచన చేసేవాళ్ళకి మార్గ దర్శకంగా ఉండటమే వీటి ప్రయోజనం. గ్రంథ రచనంటే వాళ్ళ దృష్టిలో ప్రధానంగా సాహిత్య గ్రంథరచన. ఈ వ్యాకరణాలు వాక్యనిర్మాణాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. మాతృభాషా వ్యవహర్త సహజంగా రాసేవాక్యాల్లో తప్పొప్పులను సూచించే ప్రమాణాలు లేకపోవటం వల్లనో, తెలుగు రాసేవాళ్ళకి తెలుగు వాక్యం గురించి చెప్పక్కర్లేదనో వీళ్ళు వాక్యరచనను ఉపేక్షించారు.

ఆధునిక సమాజంలో రచనా భాషకు కొత్తప్రయోజనాలు వచ్చినై పాలకుల భాష పాలితుల భాషకన్నా భిన్నమైనప్పుడు పరస్పరం ఒకళ్ళ భాష ఇంకొకళ్ళు నేర్చుకోవాల్సిన అవసరం కలిగింది ఈ పరిస్థితుల్లో పాశ్చాత్యులైన పాలకులు భారతదేశ భాషల్లో చాలా వాటికి వ్యాకరణాలు రాయించారు. ఆ సందర్భంలోనే తెలుగు కూడా ఇల్లాంటి వ్యాకరణాలు వచ్చినై. ఇవి తెలుగునేర్చుకునే ఇంగ్లీషు వాళ్ళను ఉద్దేశించి రాసినవి.

అందువల్ల సహజంగా వాళ్ళ వ్యాకరణాలు ఇంగ్లీషు భాషలో ఉంటై. ఈ వ్యాకరణాలన్నిట్లోనూ తెలుగు లిపిని గురించి వివరణ ఉంటుంది. ఇవి సాధారణంగా లాటిన్ సంప్రదాయంలో వచ్చినయి గనుక శబ్దరూప సాధన ప్రక్రియకన్నా పదపట్టికలకు ప్రాధాన్యం ఎక్కువ కనిపిస్తుంది. అన్నిటికన్నా ముఖ్యమైంది మన సాంప్రదాయిక వ్యాకరణాలు మన భాషల వ్యాకరణ రచనలో చేసిన ప్రధానమయిన సేవ యిదే.

తెలుక్కి వ్యాకరణం రాసిన మొదటి పాశ్చాత్యు డెవరో తెలీదు కానీ విలియం బ్రౌన్ ఒక వ్యాకరణం రాసినట్లు సి. పి. బ్రౌన్ తన ఆత్మచరిత్రలో చెప్పుకున్నాడు. దానిమీద ఈయనకు మంచి అభిప్రాయం ఉన్నట్లు కనబడదు. కాగా, తరువాత దొరుకుతున్న వ్యాకరణాల్లో ముఖ్యమైన తొలి వ్యాకరణం 1816 లో అచ్చైన ఎ. డి. కాంబెల్ రాసిన A Grammer of the Telugu language commonly terrled, the Gentoo, peechlar to the Hindus inhabiting the North Eastern Prounces of the Indian peninsula ఈపుస్తకంలో ఆరు అధ్యాయాలున్నాయి. సుమారు 225 పేజీల పుస్తకమిది. విడివిడిగా లిపిని గురించి, విభక్తుల గురించి, వివిధ భాషా భాగాల గురించి చర్చించిన తర్వాత సుమారు 50 పేజీలలో తెలుగు వాక్య నిర్మాణం విపులమయిన చర్చ ఉంది. నాదృష్టిలో ఈ చర్చ చాలా విలువైనది. ఆధునిక భాషా శాస్త్ర పరిశోధకులకు కూడా మార్గదర్శకమైనది.

వచ్చి, చేసి వంటి క్త్వార్థక క్రియలు వస్తూ, చేస్తూ వంటి శత్రర్థక క్రియలు వాక్యంలో ప్ర యో గిం చే పద్ధతులను చాలా విపులంగా చర్చించాడు. తెలుగులో క్రియాజన్య విశేషణాలతో వచ్చే పదబంధాలు ఇంగ్లీషులో relative clauses కి సమానం. వాటి నిర్మాణాన్ని గురించి చేసిన చర్చలో కొట్టిన మనిషి, చంపిన పులి అనే ఉదాహరణలు ఇచ్చి పులి, మనిషి అనే పదాలు కర్తలే అవుతాయని నిర్ధారించాడు. యివి కర్మలుగా వాడాలంటే కొట్టిన, చంపిన అనేవాటి ముందు వేరే కర్తలు వాడాల్సి వుంటుందని గుర్తించాడు అంటే చంపిన పులి 'కి నేను చంపిన పులి'కి కొట్టిన మనిషికి, నేను కొట్టిన మనిషి'కి ఉన్న అర్థబేధాన్ని సూచించే వ్యాకరణ సంబంధాల భేదాలను గుర్తించాడన్నమాట.

ఆ తరువాత చెప్పుకోదగిన వ్యాకరణం సి. పి. బ్రౌన్ 1857 లో అచ్చువేసిన ఏ గ్రామర్ ఆఫ్ ది తెలుగు లాంగ్వేజ్. యిది సుమారు 300 పేజీల వ్యాకరణం. ఇందులో తెలుగులో క్రియలేని వాక్యాలను గురించి విపులమైన చర్చ వుంది. తరువాత కాదు, లేదు అనే వ్యతిరేక క్రియల ప్రయోగ భేద, సాదృశ్యాలను గూర్చిన ఉపయోగకరమైన చర్చ ఉంది. తెలుగులో ఉన్న వివిధ విభక్తులు, వాటి అర్థభేదాలను గురించి కూడా బ్రౌను విపులంగా చర్చించాడు. బ్రౌను తెలుగు సాహిత్యం కూడా చదువుకున్నవాడు కావటం వల్ల చాలాచోట్ల భాగవతం మనుచరిత్ర వంటి ప్రాచీన చర్చ కాంబెల్ వ్యాకరణ కన్నా మెరుగ్గా వుంది. మనుషుల పేర్లను గురించీ, అవి వాడటంలో తెలుగు వాళ్ళకీ, యూరోపియన్లకీ ఉన్న భేదాన్ని కూడా బ్రౌను గుర్తించాడు. ఇందులో అతి విపులంగా ఉన్న చర్చవచ్చు, రాదు వంటి క్రియాపదాల ప్రయోగాల్లో అర్థభేదాలు. దీన్ని బ్రౌను AORIST tense అన్నాడు కాలబోధకత మీద బ్రౌను చేసినచర్చచాలా ఉన్నత స్థాయిలో ఉంది.

బ్రౌను తర్వాత వచ్చిన ఇంకో గొప్ప వ్యాకరణ కర్త 'A. H. Arden ఆయన A Progressive grammar of the Telugu language' అనే వ్యాకరణాన్ని 1873లో ప్రచురించాడు. ఇందులో 22 అధ్యాయాలున్నాయి. ఇది మొత్తం సుమారు 500 పేజీల గ్రంథం. 340 పేజీల వరకు ఆధునిక భాషను గురించి ఉన్నది. ఈ వ్యాకరణంలో కూడా చెప్పుకోదగింది వాక్యనిర్మాణమే. ఆధునికంగా నామ్నీకరణాలు అని పిలిచే వాక్యరచనా పద్ధతిలో విశేషాలు Arden చాలా చర్చించాడు. 'Noun Sentenses' అని రాసిన 16వ అధ్యాయం తెలుగు భాషను గురించి అంతకు ముందు ఎవరూ చెప్పని ఎన్నో విశేషాలు చెప్తుంది. ఈయన తన పీఠికలో ఈ వి ష యా న్ని గుర్తించి ఇట్లా అన్నాడు. 'By the Introducation of three chepters upon AdJectives, Adverbal and noun sentenses, a complete explanation is given of subordinate sentenses, a subject much neglected in previous works.

ఈపై చెప్పిన వ్యాకరణాలు, తెలుగు వాక్య నిర్మాణాన్ని గురించి తెలుగువాళ్ళు గుర్తించని ఎన్నో విశేషాలు తెలియజేశాయి. ఐతే తెలుగు వర్ణమాలకిచ్చినంత ప్రాధాన్యం, ధ్వనుల కిచ్చినట్లు లేదు. ఆ లోపాన్ని పూరిస్తూ 1918లో Eva C. Mair అనే ఆయన A manual of Telugu grammar on Phonetic ప్రకటించాడు. ఇది 100 పేజీల పుస్తకం. ఇందులో మొదటి సగం తెలుగు ధ్వనులకే కేటాయించబడింది. తెలుగు ధ్వనులు ఉత్పత్తి అయే పద్ధతులను చాలా శాస్త్రీయంగా వివరించడమే కాక 63 బొమ్మల్లో నిరూపించాడు. ఒక పుస్తక రూపంలో తెలుగు ధ్వనులను గురించి ఇప్పటికీ ఇంతకన్నా వివరమైన చర్చరాలేదు. అయితే 2వ భా గం లో మాత్రం ఏమంత చెప్పుకోదగిన విశేషాల్లేవు. పైగా

కొన్ని తప్పులు కూడా ఉన్నాయి. ఉదాహరణకు ముల్లుకి 'మున్ను' అనే రూపం. జున్నుకి 'జుళ్ళు' అని, వధూటికి 'వధూండ్లు' అనీ, లకోరికి 'లకొళ్ళు' అనీ బహువచన రూపాలు ఈ వ్యాకరణంలో ఉన్నాయి. బహుశా ఏవరో వ్యవహర్త ఈ కృతక రూపాలు సృష్టించి ఈనకు ఇచ్చివుంటారు.

ఇవి పాశ్చాత్యులు రచించిన సంప్రదాయ వ్యాకరణాలు, ఈవ్యాకారణాలుప్రధానంగా వ్యవహారికభాషకు రచించినవి.ఐతే వీళ్ళు ఎక్కువగా పండితుల భాషమీద ఆధారపడి ఈ వ్యాకరణాలు రచించినట్లు కనిపిస్తుంది అందువల్ల వీళ్ళు ఉదహరించిన వాక్యాల్లో కృతకత్వం. కనిపిస్తుంది.ఆ విషయం అట్లా ఉంచితే,అంతకుముందు తెలుగు వ్యాకరణాల్లో కనిపించని వాక్యనిర్మాణ చర్చ అతిప్రధానంగా ఈ వ్యాకరణాల్లో కనిపించడం గొప్ప విశేషం. బహుశా యిదే వాళ్ళు మన భాషకు చేసిన గొప్ప సహాయం. యిటీవల ఆధునిక భాషా శాస్త్ర పద్ధతిలో పాశ్చాత్యులు, తెలుగువాళ్ళు కూడా తెలుగు భాషను గురించి ఎన్నో ఆసక్తికరమయిన విషయాలు వెల్లడించారు. ఆ విశేషాలు ఇంకోసారి.

—:o:—

# జానపద సాహిత్యం-గోవుపాట

-గుత్తి నరసింహులు

ఛందోబంధం వంటి అందాలు, పదబంధాలు, లేకుండా అనాగరక మానవునితో ఆవిర్భవించింది జానపద సాహిత్యం. జానపదులలో జనించిన ఈ సాహిత్యం కొన్నాళ్లకు వ్యాకరణాదులచే సంస్కరించబడి, చక్కని, చిక్కని కావ్యారూపాలను ధరించి రానురాను ప్రజల అభిరుచులను బట్టి వివిధ ప్రక్రియాభేదాలుగా విశ్లేషణ పొంది చివరికి ఆదిమగడే గతి, అన్నట్టు మొట్టమొదటి స్థితినే పొందుతుంది. ఇది ప్రకృతి స్వభావం. అనగా ఏది ఎక్కడనుంచి వస్తుందో అది అక్కడకే చేరుకోవడం అన్నది సృష్టి రహస్యం; దాని నైజం. 'సాహితీలోకంలో సుందర నవనందనావళుల'ను నిర్మించుకొన్న పెద్దలలో కొందరు జానపదసాహిత్యోద్ధరణకు నడుం కట్టేరంటే మన తాతముత్తాతలనాటి సంస్కృతి సంప్రదాయాలకూ, ఆచార్య వ్యవహారాలకూ రూపకల్పన చేయడమేకాదు, వాటిపునరుద్ధరణకు జయపతాకను ఎత్తడమన్నమాట మద్గురువులు ఆచార్య శ్రీ తూమాటి దొణప్పగారి ఆశీర్బలంవల్ల జానపదసాహిత్యానికి అంతో ఇంతో సేవచేసే భాగ్యం నాకు కూడా లభించింది.

'సత్యంవద' ధర్మంచర' అని ఆర్షవాణి, సత్యే సర్వం ప్రతిష్ఠితమ్మని' ఉపషనిత్తుల నిర్ణయం. సత్యమేవజయతే' మన రాజ్యాంగం స్వీకరించిన సూక్తి. 'సత్యము శ్రేయము జనులకు' అని శాస్త్ర నిరూపణ. సత్యవాక్పాలన ప్రశస్తిని తెలిపే కథలు కోకొల్లలు. రామాయణాది మహేతిహాసాలిందుకు ఉత్తమ నిదర్శనాలు. "ఆడిబొంకనివాడు అరిచెంద్ర ఘురాజు - పలికి బొంకనివాడు బల్లాణ రాజు" అని జానపదుల తీర్పు. సత్యవాక్కే నైతిక ప్రవర్తనకు నాంది. మాటే మనిషికి ఇహపరాలను సాధించడానికి సాధనం; మనపురాణేతి హాసాలువేనోళ్ల చాటిచెప్పుతున్న పరమ సత్యం. "దైవాధీనం జగత్సర్వం- సత్యాధీనంతుదైవతామ్" అని దైవంకూడా సత్యానికి లోబడినట్లు చెప్పుతుంది- నీతి శాస్త్రం. "నుతజల పూరితంబులగు .... ఒక సూనృత వాక్యముమేలు సూడగన్ (1-4-94)

"వెలయంగ నశ్వమేధం, బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం దులనిడి తూపగ సత్యము, వలననములు సూపుగౌరవంబున పేర్మిన్ (1-4-95)॥ అని పంచమవేదం మహాభారతం సత్యం యొక్క గొప్పతనాన్ని నొక్కివక్కాణించింది. తనువునశ్వరతను, సిరుల అస్థిరతను తెలిసిన జ్ఞాని అయిన బలి చక్రవర్తి ఉన్నంత కాలం మిడిసిపడ్డరాజులు "వారేరే? సిరిమూట గట్టుకొని పోవం జాలిరే" (భాగ. 8-590) కాబట్టి పలికి బొంకడం కంటె పాపం లే'దని సూటిగా సత్యం యొక్క యశస్సుకు నవోహస్సులు పలుకుతూ శాశ్వతమైనది సత్యమని చాటిచెప్పినాడు, అట్టి మాట తప్పినవాడు పరమని కృష్ణుడు' అన్నారు పెద్దలు. తిర్యక్పాత్రల ముఖంగా నీతిబోధ మనకు కొత్తకాదు పంచతంత్రహితోప దేశాలిందుకు ప్రబలసాక్ష్యాలు. గోవ్యాఘ్ర సంవాదం పేర ఈ కథ అనంతామాత్యుని భోజరాజీయంలో ప్రసిద్ధం. హరికథాది కాలను వినడం వల్లనో, వీథినాటకాలను చూడడం వల్లనో జానపదులలో ఇలాంటి గాథలు వ్యాపించివుండవచ్చు. లేదా జానపదులలో నైనాప్రచుర వ్యాప్తిలోవుండి దేశిక

ధాస్తక చిత్తులూ, స్వస్థాన వేష భాషాప్రియులూ అయిన కవుల కైవాడడం వల్ల శిష్ట సాహిత్యంలో చోటు చేసుకొనివుండవచ్చు. దీనిని యిదమిత్థమని నిర్ధారించడం శక్యంగాదు, ఏదేమైనను ప్రకృత వ్యాసోద్దేశం జానపదుల రసనాగ్రాలలో నర్తనం చేస్తున్న గోవుపాటను పౌస్తికమైన గోవ్యాఘ్ర సంవాదంతో పోల్చి, తులనాత్మకంగా వివరించడం.

భోజరాజీయాంతర్గత కథలో "ఒక విప్రవరుని హోమధేనువు, నిత్య సత్యవర్తిని సదాచార మూర్తి'' (4-56) అన్నదానిలో" ఇట్టి గోరత్నమొక్కడేక తంబ,్ణపోయిమేయుచుండ బెబ్బులి యొకండు (4-56) అని చెప్పబడింది. జానపదులగేయభాగంలో

"శనివారం గొల్లబోయుడు - జలకమాడిశాలు
(వా) గప్పి
పట్టుదట్టి మొలను జుట్టి - పసిడి గొడ్డలి బుజాన
పెట్టి
పయిడి బిందిసేతబట్టి - అట్టి మందలు కదిలెను
తెల్లంగా తెల్లవారి - కారుకోడికూసెనయ్య
దొడ్డితలుపులు తీసెనయ్య - అన్నియావులు
దొడ్డిలోకి
వచ్చిపాలు ఇచ్చెనయ్య - అన్నియావులు కది
లెన్నయ్య
అందులోని పెద్దగోవు - మహాలచ్చిం అనేగోవు
అమ్మలార అక్కలార - సీతదేవి సీవురావె
శివాలచ్చిం సీవురావె - చల్లబాండం సీవురావె
ఆకాసవేణిరావె - బూదేవి తరుణిరావె
గూను గూను సెంగాలగడ్డి - గుణములోని
మెయ్యరమ్మ
అల్లుకున్నపిల్లి పెసర -అట్టిమీరు మెయ్యరు
రండి పోదాం అడివిలోకి - ఎవరిదారినివారు
పొండి
అనిసెప్పె పెద్దగోవు" అని వుంది,

అనంతుడు బ్రాహ్మణుని హోమధేనువనీ, ఒంటరిగా మేత మేస్తున్నదనీ చెప్పినాడు గోవుగురించి. "ఏకతంబ" అన్న దాన్నిబట్టి అక్కడ మందలేదని తెలుస్తుంది. కావ్యంలోని గోవు బ్రాహ్మణునిది కాదు గేయంలోని ఆలమంద గొల్లబోయు, నిదో అతని కాశ్రయమిచ్చిన యజమానిదో, మరెవ్వరిదో, అస్పష్టం. గేయంలో ,మహాలక్ష్మి అనేగోవు ఆవులకు పెద్దకాగా సీతాదేవి శివాలక్ష్మి, చల్లభాండం, ఆకాశవాణి, భూదేవి మొదలయిన పేర్లుగల గోవులు మందలో అతిముఖ్యమైనవి. కావ్యంలోని గోవు మేతకోసం ఎక్కడకు వెళ్ళిందో చెప్పబడలేదు. కాని జానపదులు మాత్రం ఆవిషయంలో తొట్రుపాటు లేకుండ "రండి పోదాం అడివిలోకి" అని మేల్కొన్నారు. అడవిలోనే కదాపులులు మున్నగు క్రూర జంతులుంటాయి. అడవిలోకి మేతకోసంపోయిన ఆలమంద చెల్లాచెదురై -

"ఎక్కరాని కొండలెక్కి-ఎక్కిపూరిమే సెనయ్య
దిగిరాని సెలమి (చెలమ) యందు-దిగిదాహం
తాగెనయ్య"

పూరిమేసి, నీళ్ళు తాగడంచేత గోవు పుష్టిగా, తుష్టిగా వుంది. కాబట్టి "అడుకొంటూ దారిపట్టింది" గోవు. అలాయింటి ముఖం పట్టిన ఆసాధు జంతువును క్రూర జంతువయిన ఒక పులి అడ్డగించి.

"కొండలు కొండలగిరుల నడుమ - ఎఱ్ఱ మచ్చల
పెద్దపులి
ఎదురుగా వచ్చెనయ్య-ఆగుమా గోమాత నువ్వు
ఎక్కడికి ఎల్లెదవునువ్వు-అయిదు రోజులనించినాకు
ఆహారం దొరకలేదు-ఎన్ని కండలు ఎదమ(ను)
గుండెలు
పచ్చిరగతం (రక్తం) పాలపేగులు-పొట్ట నిండా
రగింతును"

అని అంది. గోమాత యింటిదారి పట్టినపుడు పులి యెదురుగా వచ్చి తన మనోవాంఛను బయట పెట్టడం స్పష్టం. పెద్దపులి వర్ణన 'ఎఱ్ఱమచ్చల'ని దానికి కావ

లసింది పొట్టనిండ 'పచ్చి రక్తం, పాలపేగులన్ని స్వభావ సిద్ధంగా, మనోహరంగా వర్ణించబడింది.

కావ్యంలో పులియొక్క మచ్చులనుగాని, దానికి మహాప్రీతి కరమైన ఆహారాన్ని గురించిగాని చెప్ప బడలేదు సరికదా పులినోట మాటరానివ్వలేదు. "దాని గనిపొంచి యొద లెల్ల దాచి వాల, మవని దాటించు చును వ్రేయనదరుటయును (4-56)" అని పులి తాలూకా భంగిమను, తోకను భూమికి తాకించడం, గోవును పడవేయడానికి సమకట్టే సన్నాహం మాత్రం వర్ణించబడింది. ఆవు అదరలేదు బెదరలేదు కదా ఇసుమంతక సుగందలేదు. ఇక తనకు పులి వల్ల మరణం తప్పదని తలచి, తన బిడ్డకోసం కొంత తడవు గడువు నిమ్మంటుంది—

"అయిదు రోజులు సెలవు ఇయ్యి - నాకొక్క బాలపాపడు
పాపడాకిపాలు ఇచ్చి - మళ్లినేను వస్తునయ్య
రాకపోతే మాబాల-పాపడు తోడయ్యా"

అని తాను ఇంటికి వెళ్ళి రాకపోతే తన కన్న కడుపు తోడని ఒట్టు పెట్టుకుంటుంది. ఆపదలో వున్నప్పుడు తన ఆపదకు అడ్డు పడమని యెవరినైనా ప్రాధేయ పడి కోరినపుడు, వారు సందేహించినపుడు ఆపదలో వున్న వ్యక్తి తనకిష్టులపై ఒట్టు పెట్టు కోవడం లోకంలో అతి సహజమైన అలవాటు. ఆలాగునే యిక్కడ గోవుకూడా పులికి నమ్మకం కలిగేటట్టు లోకంలో అన్నిటికన్న మిన్నయైన కన్న బిడ్డపై ప్రమాణం చేయడం స్వభావ సిద్ధంగా వుంది.

భోజ రాజీయంలో కూడా "కళ వళములేక, యోహో నిలునిలు "మని సుకభియిట్లనియె" (4-57) మునుమును బుట్టినాకు నొక ముద్దుల పట్టియతండు బుట్టియే దెనిమిది నాళ్ల పాటి గలడింత యుఁ బూరియ మేయ నేరడే జని కడు పారజన్గుడిపి జయ్యనవచ్చెద నన్నుటోయి రమ్మని సుకృతంబు గట్టికొన వన్న దయా గుణముల్ల నిల్లగన్ (4-61) ఇందు వెంటనే వస్తా నన్నట్టు వర్ణితం. గేయంలో అయిదు రోజులు సెలవు నివ్వమని కోరుతుంది.

కావ్యంలోని గోవును ఇంటికి పోయి హాయిగా నెమరువేస్తూ "నెమ్మదినుండుగా,కిచటికేలవచ్చె దెఱిగి" యెఱిగి (4-69) అని పుండరీక మంటుంది. అంతట గోవు సత్య వాక్పాలకుల చరిత్రలని మన రేఖ, పావ లోకముల కథలు చెప్పుతుంది. పులిమాత్రం నీమాటల వల్లనాకు కడుపునిండదని "అడవిలో నున్నయంతనె పులియింత, యెఱుకలేని దయ్యనె తలంప" (6-6) అని తన వివేకాన్ని, లోకజ్ఞతను ప్రకటిస్తుంది. కాని ఆవు, మాట తప్పిన వాడు పరమ నికృష్టుడన్నట్టు గానూ, అతిథి సత్కారం కంటె యెక్కువ లేదనీ నమ్మబలుకుతుంది. తర్వాత ఇంటికి వెళ్ళి రాకుంటె ఆడవాళ్ల పొత్తు పీడనియతి గతికీ, తప్పులేక గోవులను కొట్టిన వారి గతికీ, తల్లిదండ్రులకు ఎదురు తిరిగిన వాడి గతికీ పోతానని అనేక ప్రమాణాలు చేస్తుంది. అంతపులి "నీవు ధర్మ విదురాలవు నీకెన యవ్వరు ధేనువ" (6-17) అని చమత్కారకంగా పలికి దూడ వద్దకు పంపుతుంది.

ప్రకృతగేయంలో ఆవు ఒట్టు పెట్టుకోగానే "అంత లోనే పులిరాజు-సేతిలోసెయ్యేసికోని గోవుకి దారిచ్చె నయ్య-గోమాత అరుచుకుంటూ ఇంటిదారి పట్టె నయ్యా"

తల్లి రావడంచూసి "స్తంభాన కట్టివేసిన దొరబుల్లె-అడులుకుంటు తల్లి దగ్గరికి" వచ్చింది. ఇందు గోవు సత్యపాలకుల కథలను చెప్పడంగానీ, ఆడి తప్పిన వాడు పోయే దుర్గతుల్ని గానీ చెప్పలేదు.

"ఒక్కపక్కకుదవగానె-బిడ్డ ముకము తల్లిజూసి
ఈ రోజు తల్లిపాలు-తాగి నీవు తిరగవయ్య
రేపు ఎవ్వరు ఇస్తురు?- తల్లి కెదురుగ నిలిసి కోడె
ఈ వేల పాలు ఇచ్చి-రేపివ్వక ఏడబోదు"

అని ప్రశ్నిస్తుంది పసికందు దూడ. అంతట తల్లి తాను మేతకు పోగా జరిగిన సంగతిని వివరించి

"పులికి బాసలు ఇస్తిని" అని చెప్పుతుంది. కావ్యంలో ఇంటికి వచ్చి, బిడ్డకు పాలిస్తుంది. అనంతరం ఆ యింటి యిల్లాలు వచ్చి పాలు పితుకుతుంది. తర్వాత దూడకు అసత్యాలాడవద్దనీ, ఒంటరిగా తిరుగ వద్దనీ, పొడిచే గోవుల వెంట పోవద్దనీ, కయ్యానికి కాలు దువ్వే వాటితో కలియవద్దనీ, తురగాదులు పోవుదారిని అడ్డంగా పోవద్దనీ అనేక నీతులు చెప్పి చెప్పి చివరి సారిగా తల్లిలేని సుతుడు లోకంలో అన్నిటికంటె చులకన అని హెచ్చరిస్తుంది. ఇక్కడ గోమాత తన బిడ్డకు నీత్యుపదేశం చేయగా, గేయంలో దూడ తన తల్లికి—

"ఈరాజ్జ(జ్య)ంఇడిసి పెట్టి-పరారాజ్జం ఎలదమమ్మ
ఊరుసుట్టూ మేత మేసి-ఊరు బావి నీలు తాగి
ఊరులో నున్నట్టుగా-ఊరులో లేనట్టుగా
వనావాసంసేద్దాం-సీతాదేవి రాముల వారు
పద్దాలుగేండ్లువారు-వనావాసం సేయలేద
వారికన్న ఎక్కువా మనం-మనం కూడాసేద్దాం"

అని పులి బారి నుంచి తప్పించుకోడానికి ఏవేవో యుక్తులు చెప్పుతుంది. గేయంలోని దూడ పెంకి ఖుర్రగా కనిపిస్తుంది. భోజరాజీయంలో "నీకు సమ కూరెడు శాశ్వత పుణ్యలోకముల్, నాకు నగమ్యదేశ ములె? నన్నునుదోకొని పొమ్ము (6-46) అని దూడ పలుకుతుంది. ఇక్కడ తల్లితోడిదే లోకమనే భావం కలిగి, తల్లిని మించిన బిడ్డ అనిపించుకుంది. కాని తల్లి 'అపుత్రస్యగతిర్నాస్తి' అన్న దాని కనుగుణంగా పలుకుతుంది. బిడ్డను వారిస్తుంది.

గేయంలో దూడకు యుక్తులు చెప్పగా తల్లిమాత్రం
"అబద్దం ఆడగూడదు-పులికి బాసలు ఇస్తినయ్య
మందయావులు రాండయ్య-నేనుండా దినమురోజున
ఎట్లా జరుగుతుందో - నేను లేనీ దినమునాడు
మీరు కూడా అట్లాగే-నడిసి పోవలసింది"

అని అనగా-

"నీవుండా దినము రోజున - నెలకిర్షాడొ మూలు
తప్పక కురిసెనమ్మ-నీవు లేని దినము రోజున
ఇకను ఎట్లాగుందుము? - పండనీ బూములన్నీ
తప్పకాపండెనమ్మ-నీవులేనిదినము రోజున ఇకను
ఎట్లాగుందుము?"

అనితన తోటియావులు విలపిస్తాయి. అంతట మహాలక్ష్మి గోవు తనబిడ్డడిని గురించి తక్కిన ఆవుల తో ఇలా,—

"తల్లి లేని బిడ్డడాని - ఏమిసెయ్యకరమ్మ తల్లి
కొలుగలవని కుమ్మకరమ్మ - కొమ్ములుగలవని
ఇసరకమ్మ
తల్లిలేని బిడ్డదాని - తలొకపోటుపొడవకండి
అనిసెప్పెగోమాత"

ఈ విధంగా తనతోటి గోవులకు తల్లిలేనిదని తన బిడ్డను చులకన చెయ్యవద్దనీ, బాధించవద్దని పరిపరి విధాలుగా బతిమాలు కుంటుంది. అకతేకాదు తనకోడె దూడకు కూడా —

"అన్నియావులు ఎల్లుతెంటె - అన్నియావుల
నడుమనెల్లకు
పక్కగానె యెల్లవమ్మ - పుట్టలెక్కిపూరిమేత
మెయ్యకమ్మతల్లీనీవు - ఆదిశేషుడువచ్చినిన్ను
కట్టికాటు అందుపు" అనినీత్యుపదేశం చేస్తుంది.

ఈ విషయంలో చెప్పాలంటే జ్ఞాత, అజ్ఞాత కవులిరు వురు ఒకరి కొకరు తీసి పోరనే చెప్పాలి. ఎదుటి వారిపై ఆధారపడడం కన్న తన్ను తాను చక్క దిద్దు కోవడం మంచిది అన్న అభిప్రాయాన్ని తల్లి పిల్లతో ఎంత చక్కగ పఠితల హృదయాలకు హత్తు కునేటట్టు చెప్పిందో స్పష్టం కాగలదు. ఇలా తన బిడ్డను తోటి యావులకప్పగించి, జాగ్రత్తగా నడుచు కోమని బిడ్డకు బుద్ధిచెప్పిన తర్వాత కొండలు కోనలు దాటి ఆవుపులి వద్దకు వచ్చి —

"పచ్చిరగతం పాలపేగులు - పొట్టనిండార
గించుము" అని అంటుంది. "పగలింటి యుపవాస భారంబంతయు బోవునట్లు మదకక్ష మాంసముల్ ... తో

నక్తమ్ముం సేసి నాకు బుణ్యమ్మ ప్రసాదింపుము " అని కావ్యాంతర్గత కథాకథనం. ఈ సందర్భంలో వాస్తవానికి గేయంలోనూ కావ్యంలోనూ కొంతవరకు సంవాది కథనంచేకూరిందనే భావించాలి. ఇంతతంతూ జరిగిన తర్వాత —

"ఇంత సత్తెంగల్ల గోవని-గోవుసుట్టూ పులీ తిరిగి
గోవుపాదాల మీద - అట్టి ప్రేప్రాణము లిడిసెను
మెచ్చిరయ్య చెమ్మ(బ్రహ్మ)దేవుడు- మెచ్చిపూలా
రథము తెచ్చి
రదము పై యెక్కించిరయ్య - పోయిరయ్య
సొర్గలోకం
సూసిరయ్య పుణ్యలోకం
ఇక్కడి లావుండగా అక్కడ ప్రేథకావ్యంలో
" ఆధేను రత్నంబుదన్న, భక్షింపుమని
పట్టుపఖుప సద్యోజ్ఞాన
శాలియైపరగు శార్దూల విభుడు తానొల్లననీ పల్క
(6-68)

ఈ విధంగా గోవ్యాఘ్రాలకు సంవాదం జరుగుతున్న సమయంలో వాటి ప్రవృత్తులకు మెచ్చిదేవతలు ప్రసన్నులయ్యారు. విష్ణువు ప్రత్యక్షమై వాటి కోర్కెమేరకు దివ్యలోకాన్ని ప్రసాదించగా నైచికీ శార్దూలాలు తమ తమ వాసస్థానాలకు వెళ్ళాయి. ఇక్కడ సమయపాలన చేతవూ, సద్యోజ్ఞానంచే పులీ మెప్పులకు పాత్రములయ్యాయి.

కావ్యంలో ఆవు, పులి రెండున్నూ క్షేమంగా తమ తమ నెలవులకు తిరిగి పోగా, గేయంలో వులి గోవు పాదాల మీదపడి ప్రాణం విడిచింది. భోజరాజీయాంతర్గత కథనంలో శ్రీమహా విష్ణువు వాటికి జన్మాంతరం తన సాయుజ్యాన్ని అనుగ్రహించగా గేయంలో బ్రహ్మ దేవుడు మెచ్చి, వరాలిచ్చి, వెంటనే వాటికి స్వర్గాన్ని ప్రసాదించాడు. ఫలశ్రుతిలో " ఈ గోవ్యాఘ్రసంవాదంబు విన్ననరులు - మృగపన్నగాది బాధలంబొరయరు. వెన్నుండు వారికి ప్రసన్నుండగు" (6-74)

అని వుండగా అజ్ఞాతకర్తృతకమయిన జానపద గేయంలో —

"అమ్మలార అక్కలార - వంద బింది గలావారు
పచ్చి బియ్యం పాలపొంగలి - గోవు పేరిట
సెయ్యర్

ఈ పాట పాడినవనతు (నిత) లకెల్ల - పాడిన వారికి పరమపదం ఇన్నవారికి ఇహ్వేతోంపదులు - కలుగును బాగ్గెలు, తొలుగు దోసములు అని ఉంది. ఇందు అదనంగా పాడిన వారికి కూడ పరమపదం లభిస్తుందని చెప్పబడింది. ఇక్కడింకో విశేషం. అదేమిటంటే ఏదోసత్కథా శ్రవణానంతరం అన్నదానం చేయడం అచ్చమయిన ఆంధ్రజాతి జీవనంలో అగుపడుతుంది. సత్కథా శ్రవణం వల్లనో, పఠనం వల్లనో దోషాలు పోయి, సంపదలుకలిగి జన్మాంతంలో పుణ్యలోకం సంప్రాప్త మవుతుందనే నమ్మకానికి మచ్చు తునక ఈ గేయం. అనుస్యూతంగానూ, అనుశ్రుతంగానూ వస్తున్న ఆ చారం ఈ గోవు పాటలో నిక్షిప్తం చేయబడింది. ఇలాంటి అనల్ప కల్పనా శోభితాలయిన జానపద గీతాలు జీవన రీతికి చక్కని ప్రతి బింబాలుకదా !

(పాడినవారు : దామర్ల సీతారామమ్మ, పద్మసాలి, వయస్సు 47 సం॥ కాజ, మంగళగిరి తాలూకా, గుంటూరు జిల్లా)

—:o:—

# సాహిత్యగోష్ఠి

## విశ్వనాథ దిద్ది తీర్చిన కీచకపాత్ర

వ్యాసవరచితమగు సంస్కృత భారతము నందలి కీచకుడు కేవలము దుష్టపాత్ర. తిక్కన రచించిన ఆంధ్ర మహాభారతము నందలి కీచకుడు శృంగారమును ప్రకటించి సహృదయుల సహానుభూతిని గడించినాడు. కాని, విశ్వనాథ వారి కీచకుడు విషాదమును ప్రకటించి సహృదయుల సానుభూతిని పొందినాడు.

విశ్వనాథ వారి కీచకుడు ప్రాణదఘ్నమైన ప్రణయమును ప్రపంచించి తనకే తెలియకుండ తన అంతరంగమున నినదించు విషాదాంత గీతికను గండములుగా భాసించెడి తన వాక్యముల ద్వారా వెలార్చుచు తన విషాదాంతమును తానే ధ్వనింపజేయుచు ముమ్మూర్తుల విషాద నాయకుడై విషాదాంత నాటక సహజమైన ప్రేక్షకుల సానుభూతిని సమగ్రముగా పొందగలిగినాడు.

'నర్తనశాల' లోని కీచకుడు రూపాభిమానియే కాదు, ప్రణయోపాసకుడు, నానాభరణ శీలుడే కాదు, నానావిధ నరనారి మనోభావ మర్మజ్ఞుడు; బలగర్వితుడే కాదు. బలాబల ప్రయోగ విశారదుడు; దుర్విదగ్ధుడైనను పరితాపముచే నాత్మదోషమును ప్రక్షాళనముచేసికొనగలిగిన వివేకమూర్తి, భారతము నందలి కీచకునిలో పరితాపము లేదు నర్తనశాల కీచకుని కున్న అమూల్యాలంకారము ధర్మాధర్మవిచక్షణతో కూడిన పశ్చాత్తాపము. అతడు తెలియక మృత్యువు వాత పడినాడు. ఈతడు మృత్యువును స్మరించుకొనుచునే నర్తనశాల కేగినాడు ఒకడు మరణాంత నాటక ప్రధానపాత్ర, మరియొకడు విషాదాంత నాటక నాయక పాత్ర. విశ్వనాథ వారి కీచకుడు తెలుగువారికి పరిచయము కాక పూర్వము తిక్కన చిత్రించిన కీచకుడే విషాదాంతనాయకుడని తెలుగు వారు తృప్తి పడుచుండెడివారు. అప్పుడాతడు మరణాంత నాటక ప్రధాన పాత్రయే. తిక్కన కీచకునిలో రేఖా చిత్రముగా భాసించెడి విషాదాంత నాయకుడు విశ్వనాథ వారి నర్తనశాలలో జీవకళ లుట్టిపడు వర్ణ చిత్రముగా రూపొంది తెలుగు నందలి విషాదాంత నాయకులలో 'కలువలతేని' వలె ప్రకాశించుచున్నాడు.

కీచకపాత్ర పోషణము నందు మొదట లెక్కింపతగినది సైరంధ్రి. ప్రథమ వీక్షణము నుండి క్రమముగా పరిణతి చెందినది ప్రణయభావము, ఈ పరిణతిని చిత్రించుటయందు తిక్కన క్రమము వేరు. విశ్వనాథ క్రమము వేరు. వానిని ఈ క్రింది విధముగా భావించవచ్చును.

1. కీచకుడు సైరంధ్రి రూపమును చూచి నామమును తెలియకోరెను ఆపై శరీర సౌందర్యమునకు పారవశ్యము భజించినాడు. నామరూప గుణముల యందు మనస్సు రమించెడి మానసికావస్థను మొదటి మూడు సంభాషణల లోనే ముచ్చటగా కూర్చుట ఆరంభ శిల్పమునకు అనర్ఘమైన ఉదాహరణము. కీచకుని మనోగతమైన రాగభావ గాంభీర్యమును వ్యక్తము చేయవలెనన్నచో అతని తాదాత్మ్యవస్థను భజింపగలిగిన విజాతీయ ప్రవృత్తిని ప్రవేశపెట్టి, పరీక్షించి చూడవలెను. సుధేష్ణ పాత్ర అతని రాగ మగ్నతను పరీక్షించుట కేర్పడిన గీటురాయి. ఆమె అతనిని క్షేమ సమాచారము అడిగినది. బావగారి ప్రసక్తి తెచ్చినది. ఉత్తరను గూర్చి మాట్లాడినది. బంధుప్రేమ చేత అతని రాగసమాధి భగ్నము కాలేదు రాగోదయమైన వెంటనే రాగ తైక్ష్ణ్యమును వ్యక్తము చేసెడి సన్నివేశమును కల్పించుట ఆ పాత్ర పోషణములోని సూక్ష్మగ్రంథి. రాగమునకు తైక్ష్ణ్యమేర్పడిన తరువాత తీవ్రతను కల్పింపవలెను. ప్రథమాంకము నందలి ద్రౌపదిద్వితీయదర్శనము అట్టి తీవ్రతకు నాంది పలికినది.

కీచకుడు ; చెలి ! ఇది యేమి ? నీ కోమల శరీర ముప

వాస కృశీభూతము చేయుచున్నావు? అను మాటలో తీవ్రత వలన కలిగిన ఆత్మీయత భాసించుచున్నది.

రాగతీవ్రత వియోగవశమువి ఉద్వేగముగా పరిణమింప గలదు. విశ్వనాథ కీచకుని అందువలననే ద్రౌపది నుండి దూరము చేసి వసంత పాలికోద్యానమున కంపినాడు. దూర మైన కీచకుని గురించి ద్రౌపది ఆలోచించుట మొదలుపెట్టి నది. మానవతీ పంచబాణుడని పరిచారిక పరిచయము చేసి నది. దుర్యోధనునికి నితనికిని మంచి పోలిక యున్నదని ద్రౌపది నిశ్చయించుకొనినది. నిజమునకు ఈ రెండు పాత్రలు కూడ కీచకుని వ్యాఖ్యానించినవే. పరిచారిక వ్యాఖ్యానము సాభిప్రాయము కాదు. సైరంధ్రి వ్యాఖ్యా నము భావికార్యమున కుపయోగించు భద్రమార్గము. ద్రౌపది యెదుట వలపుకానివలె కీచకుడు కనబడును. ఉత్తర యెదుట వత్సలమూర్తి వలె భాసించును. ఒక ఘడియ ముం దుద్వేగావస్థ కెక్కిన మానసిక ప్రణయస్థితి ఉత్తర ముందు అవంతయు ప్రదర్శితము కాదు. ఇది అబ్బురపాటైన విశేషము. అతడు వలయుచో నిగ్రహశక్తి ప్రకటింప కలవాడను నంశము విశ్వనాథవారు విచిత్రముగ నీ సన్నివేశము నందు ప్రకటించినారు. ఉత్తర నిష్క్ర మించిన ఉత్తరక్షణమే అతనిలో ఉద్విగ్నస్థితి మరల ఉవ్వెత్తున ఉదయించినది. మూడు తేటగీతులలో ముప్పేటగ ప్రవహించినది. దశ విధావస్థల క్రమప్రదర్శనము ఆరం భమైనది సుధేష్ణ పాపభీతిని బోధించింది. ధర్మమును సూచించియు అతనిని వారింప యత్నించెను.

సుదేష్ణ కీచకుల సంభాషణము నందు ఇరువురును ద్రౌపదీ గుణవివేచనమునే కావించినారు. సుదేష్ణ సైరంధ్రి యందలి పూజ్యభావమును ప్రకటించినది. 'ఆమె తులసి మొగ్గ వంటిదని' చెప్పి ఆమె పవిత్రతను కీచకుని ముందు కీర్తించినది. ఆ తరువాత జరిగిన సంభాషణలో విశ్వనాథ వారు కీచకుని యందలి పరస్పర విరుద్ధ లక్షణములు కల్గిన రెండు భావముల యొక్క అంచులను ప్రకటించి నారు.

1. అక్కా! వా ప్రాణముల మీఁది యాస వదలుకొమ్మ నెదవా?

సైరంధ్రి తన కలభ్యమైనచో తన ప్రాణములు నిలుచుట అసంభవమని పలికినాడు. ఇది అనురాగ మగ్నత లోని భోగవాంఛా కెరటము యొక్క ఉద్విగ్న హేల.

2. సుదేష్ణ 'ఆమె మొగము చూచిన పూజింపవలెనను భావము కలుగును. కాని ఇట్టి రురూహలు నీకేల పుట్టినవి.' అనినప్పుడు కీచకుడు 'నాకామె పాదాభివందనము కూడ చేయవలెనని' ప్రత్యుత్తరించినాడు. ఇది మోహోన్మా దముతో నన్నమాట కాదు. ప్రణయోపాసకుని వలెనన్న మాట. ఒక వాక్యమునందు ఉపభోగమును, మరియొక వాక్యమునందు ఉపాసనమును వ్యంజింపజేసిన ఆ పాత్ర లోని భావవైరుధ్యము తప్పక సంఘర్షణకు దారి తీయు ననియు అది చివరి కతనిని విషాదాంతమునకు గురిచేయు ననియు సూచించుచున్నది. అతని అంతరాత్మ అతనికే తెలియకుండ పలికిన పలుకులు 'కాక నా ప్రాణములు త్రుంచుకొని పోవునా మతి'. ఈ ఘట్టము చదువునప్పుడు విశ్వనాథ వారి కీచకుడు రామాయణ కల్పవృక్షములోని రావణునికి పూర్వజన్మము వలె భాసించును. నర్తనశాల లోని కీచకుడు బీజమువంటి రావణుడు. రామాయణ కల్ప వృక్షములోని రావణుడు వటవృక్షముగా పెరిగిన కీచకుడు సీతను దేవిగా చూచెడి ఉపాసనా భావము దాని వెనుకనున్న జీవుని వేదన. ద్రౌపదిని కాంచెడి కీచకునిలో నది తొల వెలుగురేఖ వలె తొంగలించుచున్నది. విషాదనాయకునకు నిట్టి వైలక్షణమును ప్రథమాంకము నందే కల్పించి విషా దాంత నాయకుని యందు సహజముగా భాసించెడు భావ సంఘర్షణకు ప్రాతిపదికలైన మానసికావస్థలను బలముగా విశ్వనాథ వారు ప్రతిష్ఠించినారు. అక్కగారి అడ్డుమాటలు ఆమె కావించి చేసిన గంధర్వబలకీర్తనము అతని మేల్కొ లిపినను తన అంగబలము కంటె అనంగబలమునే కీర్తిం చుచు తన రాగమగ్నతను ప్రకటించెను.

ఉద్విగ్న హృదయము భౌతిక వస్తువును భావనా మయము చేయును. కీచకుడు దర్శించిన సైరంధ్రి సౌంద ర్యమును ఆతడు భావుకుని వలె భావించి; భావకవి వలె కీర్తించినాడు. లౌకిక భావములు భావనామయములై రస లోకము లంటెడి అనుభూతిని కలిగించెడి మానసిక అవస్థ యిది. ఇట్టి తరుణము నందు ద్రౌపది మరల అతని కంట పడినట్లు చిత్రించుట శిల్పమెరిగి చేసిన పని. ఈ మాటు అతని నోట వివిధ ఛందములు లాస్యము చేసినవి. అందు లోను అతని సంబుద్ధులు చిత్రముగా భాసించినవి. 'ప్రేయసీ... నాకేల తివ్పలు పెట్టెదవు? అని విరహో త్కంఠతను ఒకసారి ప్రకటించి 'దేవీ! కన్నెత్తి చూడుము నీ దృగంత భాగీరథీ వాహినిలో 'బవిత్రుడనై పోయెదను' అని భక్తిభావాన్నిద్రముగా మరియొక వైపు పలవరించును.

'శరత్కాల చంద్రరేఖా!' 'మాధుర్యమా!' 'మనోహారిణీ!' మొదలగు సంబోధనలు అతని భావ తన్మయావస్థను వ్యక్తము చేయుచున్నవి. ఇట్టి భావనా లోకమునుండి అతడు ఆమె చేయిని గ్రహింపబోవును. అతడు వాస్తవమును స్వాప్నికముగా అనుభవింప యత్నించినాడు. ద్రౌపది తన భర్తల పరాక్రమమును ప్రశంసించుచు అతనిని జంకించి వాస్తవ లోకమునగు లాగెను. అతడు తన బలమును తానే ఒక క్షణము కీర్తించుకొని మరల భావనామయ జగత్తున ప్రవేశించి ఆమెను సమీపించి 'చెలీ! దయ చూడుము. నీ శరీరస్పర్శ చేతనే పులకింత బ్రహ్మానందము పొందు నాకేల దూరదూరము పోయెదవు' అని పలుకును. రసలోక విహారియైన రసికుడు మాత్రమే శరీరస్పర్శచే బ్రహ్మానంద స్ఫూర్తిని పొందగలడు. మాటలలో మానసిక స్థితిని వ్యంజింపజేసెడి సంభాషణమిది. ఇతటి తన్మయ భావస్థితిలో నున్న కీచకునికి అంతఃపుర గౌరవమును జ్ఞప్తికి తెచ్చి వాస్తవము తెలియజెప్పినది. 'కీచకుడు నివ్వెరపోయినాడు. 'మంచి సంగతి జ్ఞాపకము జేసితివి కాని, నా హృదంతరము దహించుచునే యుంటివి' అని నిష్క్రమించినాడు. లౌకికాలౌకిక మానసికావస్థల మధ్య డోలాయమాన స్థితిలోనున్న రాగమగ్నుని రమణీయ మానసిక స్థితి అపూర్వముగా అవస్థాక్రమ వికాస సుందరముగా ప్రథమాంకమున చిత్రించినాడు విశ్వనాథ.

ప్రథమాంకము నందలి కీచకుడు రక్తుడై భావించగలడు. తద్భావనలో తన్మయుడు కాగలడు. తన భావ ప్రవాహమునకు అడ్డు చెప్పినను తరింపగలడు.

అట్టి అవస్థలో కూడ లౌకిక మర్యాద కాపాడగలడు. ధర్మమన్నచో ఉలికిపడి పక్కకు దొలగగలడు. విరాటపర్వము నందలి బలగర్వితుడైన కీచకుడు సూర్యు డంపిన రాక్షసుని తాకున కోడి వెనుతిరిగెనే కాని ధర్మమునకు వెరచికాదు. 'నర్తనశాల' కీచకుడు ప్రభుధర్మమునకు ప్రతీకగా నిలచినాడు. ఉత్తరను చూచి, ఉన్మాదావస్థలో కూడ వెచుదిరిగిపోయినాడు. అంతఃపుర ధర్మమను మాట విని ఆశ్చర్యపడిన కీచకునిలో రాజధర్మమును గౌరవించి వెనుదిరిగెడి ప్రవృత్తికి బీజము నాటబడినది.

ద్వితీయాంకము నందు భావోద్వేగస్థితి భావోన్మాద స్థితిగా మారినది. ఉన్మాదస్థితిని వ్యంజింపజేయనట్లు సంభాషణము దీర్ఘమైనది. ఉన్మాదస్థితి యందే వల్లకి మోసపు పన్నుగడకు సౌముఖ్యమును ప్రకటించినాడు. మోస మతనికి సహజముగా సరిపడదు. కార్యసాధనకు ఉపాయాంతరము నాశ్రయింపక తప్పలేదు. అతని అంతరాత్మ అంతస్స్పర్శ ణకు గురియైనది. అంతరాత్మ కంటె అనంగుడు బలవంతు డయినాడు.

ఒక యెడ నిది న్యాయము కా
దు కాదనియె యంతరాత్మ దూషించెడు త
ప్పక చేయకున్న నసువులు
పెకిలం చెడినో మరుండు వీత దయుండై

ప్రథమాంకాంతమున న్యాయమును స్మరించి సైరంధ్రి యెదుట నుండి నిష్క్రమించినాడు. ద్వితీయాంకాంతమున న్యాయాన్యాయ విచారములు సల్పియు మన్మథుని వలన ప్రాణములు పోవునని భయపడి న్యాయమును త్రోసిరాజని సైరంధ్రిని సాధింప నెంచినాడు. చతుర్థాంకము నందలి కీచకుడు భావోన్మాదము యొక్క యుత్కట స్థితి యందు నిలచినాడు. జలదమును చూచి ప్రణయనీ సామ్యమును భావించి వలపు గీతికలు పాడినాడు. అత దనుభవించెడి భావ ప్రపంచము అతని ప్రాణముల నావరించగలిగినది. బాహ్యప్రవృత్తికి మధ్య అంతరము సన్నగిల్లినది. ఇట్టి బహిరంతర ప్రవృత్త్య భేద తన్మయస్థితి శారద్వతుని జలదాంగన ప్రసంగము నందు ధృఢపడినది. ఊర్వశీ వియోగతప్తుడైన విక్రముని యందు కాళిదాసు చిత్రించిన భావోన్మాదస్థితి యొక్క సాజాత్యము నర్తనశాల యందలి ఈ అంకమున ప్రత్యక్షము కాగలదు.

విక్రముడు కరుణరస నాయకుడు. కీచకుడు విషాద నాయకుడు. ప్రకృతిలో ప్రణయినిని భావింపగలిగిన కీచకునకు భౌతికముగా నెదుట నిల్చిన ద్రౌపది శృంగారరస పట్టభద్ర. లౌకికాలౌకిక రసజగత్తుల మధ్య అతనికి ఊగిసలాట. ఆకసమున ఆ సౌందర్యము ధరణీతలమున ఈ సౌందర్యము ఆకసపు టంచులను భావోన్మాద స్థితిని ప్రకటించిన భావుకుడు.

పంచమాంకము అతని భావుక స్థితిని భౌతికమునకు దిగజార్చినది. అతడు ద్రౌపదిని తరుముకొని పోయినాడు. ఆమె అంగాంగ సౌందర్యమును అభిలాషతో వర్ణించినాడు. భావ రసికత భావనామయమైనపుడు శక్తిద్యుతమై రసలోకము నందించును. అదియే భౌతికమై యింద్రియ వశమైనచో మనసును రసాతలమునకు దింపివైచును. భావోన్మాద స్థితి యింద్రియోన్మాద స్థితికి విస్తరిల్లినపుడు భావస్థితి భోగస్థితికై పరుగు లెత్తునపుడు

సహజముగా ధర్మము నెదిరించెడి శక్తి మనస్సు కోల్పోవును. మన్మథుని పరాక్రమమును ప్రశంసించిన కీచకుడే ఉత్తరని చూచి ఉలికిపడినాడు. ఇంద్రియవశుడైన సింహబలుడు ధర్మము నెదిరించలేని బలహీనుడు. అతని హృదయము నందు మరుగు పడిన ధర్మభీతికి ఉత్తర ప్రాణప్రతిష్ఠ చేసినది. ఇది కీచకుని పాత్రలో విశ్వనాథ కల్పించిన క్రొత్తమలుపు. ఇతనిలో ఈ మలుపు తిరుగు వరకు ఈ నాటకమున ధర్మజుడు కానరాడు. ధర్మజుడు ధర్మమూర్తికి ప్రతీక. కీచకునకు ధర్మదర్శనము కాదు. కాని ధర్మసంస్కారమునకు ప్రతిరూపమైన ఉత్తరా దర్శనము ఆయినది. ఉత్తర వలన ధర్మ సంస్కారము మేల్కొనినది.

షష్ఠాంకారంభము నందు కీచకుని హృదయములో ఉత్తర బల్లెమై నిలచినది. 'నే నెందులకింత బేల వోయితిని. నేను రాజకూతు రన్నది. రాజశబ్దము నన్నంత భయపెట్టవలయునేమి? ఆ పసిపిల్లలో అంత న్యాయమున్నదా! అని వితర్కము నారంభించినాడు.

ధర్మభీతి అతనిలో పాపవర్తనములను గురించిన వితర్కమును మేల్కొలిపినది. గంధర్వులు తనను చంపుదురేమో యని భీతి మోసు లెత్తినది. తనను చంపగలిగినవాడు భీముడొక్కడే యను స్మృతి నిలచినది. పాండవులకును గంధర్వులకును సంబంధ మున్నదా!' యను అనుమానము కలిగినది అంతరాంతములందు భర్తృపంచకమును పరవశింప చేయగలిగిన పాంచాలి యొక్క పొందు పొందుటమే జీవిత పరమార్థమని భావించెను. ఆమెను పొందెడి ప్రసక్తిలో అతనికి అయుః ప్రసక్తి లేదు. పాప పుణ్య చింత లేదు. భౌతిక ప్రసక్తి కంటే మించిన మధురమైన భక్తి భావము కొంతవ్యాపించియున్నది. ఆమెను కౌగిలించుకొనుటకు లజ్జను వీడి వీధులలో పరుగెత్తిన కీచకుడు ఆమెకు బదులు ఆమె పూవులు కోసిన తీగనైనను తాకి అపూర్వ తృప్తిని పొందుటకు సిద్ధమైనాడు. షష్ఠాంకాంతముని కీచకుని భక్తి రక్తిగా మారినదని శారద్వతుడు వ్యాఖ్యానించినాడు. రతి శరీరము నంటి ప్రవహించినచో రక్తి యగును. ఆత్మనంటి ప్రవహించినచో భక్తియగును. అట్టడు ద్రౌపదిని భౌతికముగా కామించెడి భోగదృష్టి నుండి హార్దికముగా రమించెడి యోగస్థితి వరకు కీచకు డెదిగినాడు.

సప్తమాంకము నందు కీచకుడు ద్రౌపదిని గాంచినపుడు ఆమె పాంచాలియా! కాదా! అను అనుమానమును నివారణము చేసుకొనెను తలవని తలంపుగా అమె ప్రసన్నురాలయ్యెను.

అతనిలో అప్పడికే యోగభోగదృష్టుల మధ్య జరిగిన సంఘర్షణము లందు భోగమణగారి రాగమతిశయించి యుండగా ఆమె అంగీకారము భోగమును మరల ముష్టి మంతమొనర్చినది.

అష్టమాంకారంభమున కీచకుడు ఈ యోగభోగముల మధ్య నలిగినాడు. అతనిలో జాగృతమైన ధర్మభీతి నర్తనశాల కేగుటకంటె నడుమనే పిడుగుపడి చనిపోవుట మేలని తలపింపజేసినది. కారుచీకటిలో; వర్షపాతములో తెలియక అన్నమాట నిలబెట్టుకొనుటకై అడుగులను ముందుకువేయుచు నర్తనశాలవైపు నడచినాడు. అతడు వెళ్ళినది సంకేత స్థలమునకు, అక్కడ ప్రణయము లభించునో, ప్రళయము సంభవించునో యను అనుమానముతో వెడలినాడు. తన ప్రస్థానమునకు ఆధ్యాత్మిక వ్యాఖ్యానము నిచ్చుకొనినాడు. 'బ్రహ్మ పదార్థము ప్రకృతిలో ప్రతిఫలించుట దానికి సహజము. అందుకనియే పురుషుడు తన ప్రేమ రమణీయమూర్తిలో ప్రతిఫలించగా చూడవలెనని అరాటపడుచుండును.' ఇట్టి సాత్వికదర్శనము చేయగలిగిన కీచకుడు భౌతికముగా మరణించినను అధ్యాత్మికముగా అతడు అనుభవమూర్తియై నిలవగలడు.

లోకమున పురుషుడు స్త్రీని రమించి భావించి తద్భావనామృతమైత ప్రణయతత్త్వమును దర్శించి తత్ చింతనమున ప్రకృతి తత్వమును పురుషత్వమును వివేచించి పులకిత బ్రహ్మానందస్థితిని అనుభవించి ప్రణయభావ దర్శనము చేయగలిగిన రసికునకు భౌతికానుభవము గౌణమేకాని ప్రధానము కాదు. నర్తనశాలలో ప్రవేశించిన కీచకుడభిలషించినది సైరంధ్రితనూ సంయోగముకంటె తత్ప్రణయ భావనానందభావ సుఖస్పర్శ. ఆనందసతినుండి భౌతిక స్థితికిజారుటయే పతనము నంగీకరించుట. పతనమునకేమారు పేరు మరణము. భీముడు అట్టిమరణమే కీచకునకు లభింప జేసినాడు విశ్వనాథవారి కీచకునకు ద్రౌపది ప్రణయమ్ము

లభింపక పోవుటయే విషాదాంతము. అట్టి కీచకుని భీముడు మల్లయుద్ధము నందు చంపుట చచ్చినవానిని చంపుటయే. అందువల్లనే కీచకుని భౌతికమైన మరణము ఈ నాటకము నందున ప్రదర్శింపబడలేదు. ఇది పాత్ర పోషణమునందు విశ్వనాథ ప్రదర్శించిన ఔచిత్యములలోనెల్ల పరమౌ చిత్యము.

ఇట్లు
ఆర్. కమల
35/4 ఆర్. ఎల్. ఐ. జి. హెచ్.
బర్కత్‌పుర
హైదరాబాద్-37

—o—

# సంగ విజయము

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు వ్రాసిన 'మాలపల్లి'కి 'సంగవిజయము' అని మరో పేరుంది. మొదట్లో రచయిత 'మాలపల్లి' అని పేరుపెట్టి వ్రాయడానికి పూనుకొన్నారు. కొంత రచన సాగాక 'సంగ విజయము' అని పేరు పెడితే బాగుంటుందని వారికి తోచింది. అప్పుడువారు ఆ రెండు పేర్లూ వుంచి, యేది తగిన పేరో నిర్ణయించే బాధ్యతను చదువరులకే వదిలేశారు. అంతటివారే నామ నిర్ణయ బాధ్యతను ఇతరులకు వదిలేసినప్పుడు మనమెంతటి వారము? అయినా ఆలోచిద్దాం.

సమాజంలో హరిజనోద్ధరణాన్ని 'మాలపల్లి' ముఖ్యముగా ప్రబోధిస్తోంది. కథ యావత్తూ మాలపల్లి లోని మాలలను పరివేష్టించి వుంది. రామదాసు, సంగదాసు, వెంకటదాసు, అప్పాదాసు, జోతి, మాలక్ష్మి మొదలైన పాత్రలెన్నో మాలపల్లి లోవే. రామానాయుడు మున్నగు వారు మాలపల్లి వారిని ఉద్ధరించటానికి, వారికి సహకరించటానికి ప్రయత్నించారు. చౌదరయ్య లాంటి వాళ్ళు మాలల్ని రాచిరంపాన పెట్టటానికి పూనుకొన్నారు నవల ఆద్యంతం మాలపల్లికి మాలలకి సంబంధించిన సన్నివేశాలతో నిండి వుంది. రామదాసు మాలపల్లికి హృదయం లాంటివాడు. జన్మచేత మాలవాడైనా గుణము చేత ఆదర్శప్రాయుడు. జీవితంలో ఎన్ని సమస్య లెదురైనా, ఎన్ని కష్టములు కలిగినా సహించి, దైవదత్తములుగా భావించి వానిని ఆత్మోన్నత్యాని కనుకూలంగా మలచుకొన్న యోగి పుంగవుడు. ఇతని పెద్దకొడుకైన వెంకటదాసు కూలీలపై భూస్వాములు చేసే దౌర్జన్యాలను సహించలేక తక్కెళ్ళ జగ్గడుగా మారి అన్యాయాలను అరికట్టటానికి ప్రయత్నించాడు. సంగదాసు తన జీవితాన్ని పేదలైన మాలల సంక్షేమానకై సమర్పించాడు. రామానాయుడు భూస్వామి కొడుకైనా మాలెపల్లిని ఉద్ధరించటానికే యావచ్ఛక్తినీ వినియోగించాడు. చౌదరయ్య మొదలైనవాళ్ళు అధర్మమార్గంలో నడచినా అంతిమ విజయం ధర్మానికే చేకూరింది. పంచములకు ఒక కళాశాల ఏర్పడింది. భూస్వాముల దౌర్జన్యం, అధికారుల దౌష్ట్యం చివరికి అపజయాన్ని పొందాయి. కార్మికోద్యమమూ, పంచమోద్యమమూ జయాన్ని పొందాయి.

ఇలా మాలపల్లి లోని కథా, అందులోని సన్నివేశాలూ, పాత్రలూ మాలపల్లి చుట్టూ, మాలల చుట్టూ వుండి వారి ఉద్ధరణానికి, వారి ఉద్యమ విజయానికి సహకరించాయి. కాబట్టి 'మాలపల్లి' అనే పేరు నవలకు ఉచితంగానే వుంది

'మాలపల్లి' లో సంగదాసు పాత్ర కెంతో ప్రాధాన్యముంది. ఈ పాత్ర మొదటి భాగంలోనే నిష్క్రమించినా, దాని ప్రాధాన్యం మాత్రం నవలలో అద్యంతమూ వుంది. 'సంగదాసు' అనే పదం 'సంఘదాసు' శబ్దభవమే అంటారు. సంఘానికి సేవ చేసేవాడు సంగదాసు ఈ నవలలో సంగదాసు చేసిన సేవ నిరుపమానంగా వుంది. హరిజనోద్ధరణానికి అతడు చేసిన కృషి ప్రశంసార్హంగా వుంది. సమాజంలో కూలీలు గౌరవం పొందటానికీ, పంచముల హోదా పెరగటానికి, కులభేదాలు అంతరించటానికి భూస్వాముల దౌర్జన్యం నశించటానికి- సంగదాసు చెప్పిన మాటలు, చేసిన చేష్టలు విస్మరించ లేని విధంగా వున్నాయి. పంచమోద్యమాన్నీ, కార్మికోద్యమాన్నీ ప్రారంభించిన వెంటనే అతడు మరణించినా, అతని ఆశయాలు మాత్రం బలాన్ని పుంజుకొని నెరవేరినాయి. అందే సంగ విజయం సాధ్యమైనదన్నమాట.

సంగదాసు మరణించేటంతవరకు పంచమోద్ధరణానికై పాటుపడ్డాడు మరణించేటప్పుడు 'మనమే గెలుస్తాం' అన్నాడు. తర్వాత రామానాయుడు మొదలైనవాళ్ళు నడుం కట్టి సంగదాసు ఆశయాలు ఫలించటానికి ప్రయత్నించితమ సర్వస్వాన్ని సమర్పించారు. చిట్టచివరకు పంతులు వంటి

వాడుకూడా సంగదాసువాక్కు సత్యవాక్కనీ, అదినెర వేరిందనీ, తన అనంతరం తన యావదాస్తి సంగకళా శాలకే చెందాలనీ తాను బ్రతికున్నంతవరకు ఉచితంగా కళాశాలలో గుమస్తాగా పనిచేస్తాననీ చెప్పాడు. అప్పుడం దరూ అది సంగవిజయానికి కిరీటమని కీర్తించారు.

ఇట్లా పరిశీలిస్తూపోతే 'మాలపల్లి'లో సంగదాసునాయ కుడుగా వుండడం- అతడు తన ఆశయసాధనలో నిమ గ్నుడై అసువులర్పించటం, అతని అనంతరం అతని ఆశ యాల సాఫల్యానికై యితరులు పూనుకోవడం, అవి ఫలిం చటం జరిగింది, కాబట్టి సంగవిజయమనే పేరు నవలకు సముచితమని తోస్తోంది.

సంగవిజయమంటే సంఘదాసు విజయమనీ, అతని ఆశయాల సాఫల్యమనీ మాత్రమేకాక, సంఘముయొక్క విజయమని కూడా చెప్పవచ్చు. సంఘంలో వున్న దురాచా రాలను, దౌర్జన్యాన్ని రూపుమాపే ప్రయత్నమే నవలలో సర్వత్ర ఆవరించివుంది. ఆ ప్రయత్నంలోనే సంగదాసు ప్రాణాలను కోల్పోయాడు. ఆప్రయత్నంలోనే రామా నాయుడు మొదలైనవారు సర్వస్వం అర్పించారు. ఆ ప్రయత్నంచివరికి సఫలమయింది. అంటే సాంఘిక విజయం సాధ్యమయింది. కాబట్టి 'సంగవిజయము' అనేపేరు సముచితంగాఉంది.

'మాలపల్లి' అనేపేరు ఉచితంగానూ, 'సంగవిజయము అనేపేరు సముచితంగానూ వున్నా; 'మాలపల్లి' అనే పేరే బాగాప్రసిద్ధికెక్కింది. ఈ పేరులో ఒకప్రత్యేకత వుంది. అదేమిటంటే విన్నంతనే వస్తువు స్ఫురించటం. హరిజనో ద్ధరణ, అస్పృశ్యతానివారణ, సమాజంలో మాలల పరిస్థి తులు, వారిని బాధించే ధనికుల ఉదంతాలూ, మాలల అభ్యు న్నతికై పాటుపడే కొద్దిమంది వ్యక్తుల వృత్తాంతాలూ మొద లైనవానితోకూడిన ఇతివృత్తం వెంటనే మనోనేత్రానికి గోచరమౌతుంది. సంగవిజయమనే పేరు చాలామందికి తెలియదు. కాని 'మాలపల్లి' అని అనగానే చాలామందికి సర్వమూ సాక్షాత్కరిస్తుంది.

డాక్టర్ పి. వి. చలపతిరావు
ఎం. ఏ. పిహెచ్. డి.
11-14, రామంతాపూర్,
హైదరాబాదు-500 991.

# 'కుందుర్తినాలోని నాదాలు- ఒక పరిశీలన'

వీణ కవిత అయితే తంత్రులు వాటిపాదాలు. ఒక్కొక్క పాదంలో భావగర్భితమైన పదాలు నిండుకున్నట్టు తంత్రుల్లో నాదాలు పొంగి పొర్లుతాయి. కుందుర్తి తనగుండెను వీణగా మీటి తనలోని నాదాల్ని పలికిస్తాడు.

'ప్రతి మనిషీ తనలోతాను తీరిక చిక్కినపుడల్లా ఏదో గొణుక్కునే వుంటాడు, ముఖ్యంగా పరిపక్వమైన మనస్సు గల ఆలోచనా పరులు. ఆ లోపలి భావ సముదాయం కవి త్వమో, సంగీతమో, చిత్రలేఖనమో ఏదో రూపంలో బైటికి ఉబుకుతుంది' అంటాడు కుందుర్తి.

ప్రతి మనిషిలోని నాదాలు వేరు కుందుర్తి నాదాలు వేరు ఈ నాదాల్లో లోకం ప్రతిబింబిస్తుంది. ఈ నాదాల్లో స్పృహ వుంది ఈ నాదాల్లో సామాజిక సూక్ష్మ పరిశీలన వుంది. ఈ నాదాల్లో సాహిత్య దృక్పథమూ వుంది. సామా జిక పరిశీలన, సాహిత్య దృక్పథంలో వ్రాసిన కవిత్వం ఉత్తమ కవిత్వం. ఈ కవిత్వంలో ప్రయోజనాన్ని గుర్తించి తన నాదాల్లో సామాజిక స్పృహను సాహిత్య దృక్ప థాన్ని జీర్ణించుకున్నవాడు కుందుర్తి ఆంజనేయులు.

కవి హృదయం వెన్న లాంటిది, కొంచెం వేడి సోకితే కరిగి నీరై పారుతుంది, కుందుర్తిగారు సమాజాన్ని హృద యంతో చదివి ఆత్మలో ఆనందాన్ని పొందుతాడు!

'ఆత్మలోనే ఆనందం వుంది
అది విపంచి
తాకితే పలికే ధ్వనులు తలచి తల పంకించి
నాలోని నాదాలకు ఉలికి పడతాను.'

ఎక్కడ మీటినా వీణ పలికినట్టు, ఆత్మను వీణగా మార్చి ఏ గాలి తాకినా పుట్టిన నాదాలకు ఆత్మావలోకనం చేసుకుంటాడు కుందుర్తి.

నేను లేంది సూర్యుడు లేడు
నేను లేంది భూదేవి లేదు
నేను లేక కవిత లేదు; నేను లేక వరుణ లేదు.

చంద్రుడు బతకాలంటే సూర్యుడుండాలి! సూర్యుడు బతకాలంటే మనిషి ఉండాలి. ఆ మనిషే కవి. 'సూర్యుడికి

వెలుగు నిచ్చేది నేనని ఎంతమంది తెలుసుకున్నారు' తను లేంది సూర్యుడు, భూదేవి, కవిత, కరుణ లేదంటాడు కుందుర్తి.

నిజానికి కవినిర్మించుకున్న కావ్యసౌధానికి తనే గోడలు కట్టుకుంటాడు, అనన్య సాధ్యంగా పెరిగిన ఆదర్శాల నీలి కొసల్ని కొనవ్రేళ్లతో ముట్టుకుంటాడు. భూమ్మీద కప్ప బడిన మంచుసూర్యుడ్ని ఆపలేనట్టుగానే, పుటల్లో కెక్కిన చరిత్రకాలాన్ని ఆపలేదు. కాలం అనంత ప్రవాహం. ఈ ప్రవాహంలో ప్రజలు నావలు. ప్రవాహంలో ప్రయాణం చేస్తున్న ప్రజలు మార్పుకోరడం సహజం మార్పు దానం తటదేరాదు. మానవుని ప్రయత్నంవల్ల నిరంతర కృషివల్ల వస్తుంది. ఆప్రయత్నం ఉద్యమాల వానచినుకుల్తో భూమి పచ్చనిమార్పు గ్రహిస్తాడు

నడుస్తున్న చరిత్రలో ఉద్యమాలు విరజాజులు
ముడుస్తుంది ప్రజావాణి
ప్రాకే పరిమళాల వంటి మార్పుల్ని గ్రహిస్తుంది
కాలం విప్లవపాణి

ఉద్యమాలు సృష్టించేవారు ప్రజలనీ, మార్పును కోరే వారూ ప్రజలనీ, ఈ ఉద్యమాల చరిత్ర కొప్పులోని విర జాజులవంటివనీ. ఆ విరజాజుల పరిమళాలే మార్పులనీ, అదే విప్లవపాణి అనీ చక్కటి భావచిత్రణ గావిస్తారు.

"సగర్వంగా చెప్తున్నాను
సాగరంభూగర్భం కోసేచోట
గుండెల మీద ఆనించి కూలీలు
కొండరాళ్లు మోసేచోట
అందులో నేనున్నాను"

కవి తన ఆదర్శం చెప్పుతున్నాడు. ఆ ఆదర్శంలో ఎంత వాడి వుందో అంత కరుణ వుంది. ఆ కవిత్వంలో ఎంత గంభీరముందో అంత మృదుత్వ ముంది.

'కూలి కుప్పైన పూరిండ్లకు ఆశల కప్పులు వేసే నీతిలో అందులో నేనున్నాను.'

'బాలసూర్యుని లేత కిరణాల చరణాలకు స్వాగతం చెప్పుతూ భవిష్యత్తు కొమ్మ మీద వాలిన పక్షులబృందంలో నేనున్నాను.'

కూలి కప్పైన పూరిండ్లకు తన కవితా హృదయం కరిగి బాలసూర్యుని లేత కిరణాల వంటి తన కవితా ఉద యాన్ని పంచుతూ భవిష్యత్ కొమ్మ మీద వ్రాలిన పక్షులు తన ఆదర్శం అని చూపుతాడు కుందుర్తి.

కందుకూరి శ్రీరాములు
61, పాత పి. జి. హాస్టల్,
ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్,
హైదరాబాదు

–0–




## యువస్వరాలు

(కవితా సంకలనం)

సంపాదకుడు-రాధేయ
ప్రచురణ-సాంస్కృతీ సమాఖ్య, ఆంధ్రప్రదేశ్
ప్రతులకు-వి. శిరీష్‌కుమార్-ప్రధాన కార్యదర్శి
సాంస్కృతీ సమాఖ్య-రాష్ట్ర కమిటీ
నున్న-వయా, విజయవాడ-521212
వెల మూడు రూపాయలు.

ఇది యువకవుల కవితా సంకలనం. ఇందులో ఏబది మంది కవుల, కవయిత్రుల కవితలు సంకలనం చేయబడినాయి. పన్నెండు మంది కవయిత్రుల కవితలను సంతరించడం ప్రశంసనీయం. ఇందులోని కవితలు చాలా వరకు సాహితీ లోకానికి అపరిచితాలే అయినా కొన్ని కవితలు మంచి స్థాయిలో ఉన్నాయి. కుమారి పిల్లలమర్రి విజయలక్ష్మి 'ఈ రాత్రి' అనే కవితలో రాత్రిని "కరువు నీటిలో స్నానం చేసి కురులార పోసుకొని దిక్కులేని గడసానిలావుంది" అంటూ చమత్కారంగా వర్ణించారు.

"వికలాంగుల ఏడు గడిచి పోయింది ఐనా ఇంకా నాదేశంలో చట్టం-గుడ్డిది ధర్మం-కుంటిది సంఘం-మూగదే" అనే కర్లెపాలెం హనుమంతరావుగారి మినీ కవిత కవి ప్రతిభనూ, సామాజిక స్పృహను వెల్లడిస్తున్నది. "సామాన్యుడు" అనే రాధేయ కవిత శ్లాఘనీయంగా ఉంది. "వాడి నవ్వు మెరుపు వీడి జులుం ఉరుము వాడిది కంట గురి వీడిది కండసిరి"

"మీకు లేని
ఆ పచ్చనోట్లు కేవలం
కాలాన్ని కొనగలవ్!
రగిలే మీ గుండెల్లో
రంగు మారుతోన్న
కన్నీళ్ళు
కాలాన్నే మార్చగలవు"

అనే తేజస్వీత కవిత వాడినీ, వేడినీ విరజిమ్ముతున్నది. కుమారి డి.రమాదేవి "స్పందన" రాజోలి శివరామిరెడ్డి "నిప్పురవ్వలు" కూర్మారావు "నిప్పు" మొదలైన కవితలు యువతలోని ఉద్వేగానికి ప్రతీకలు. ఐతే కొన్ని కవితలు మరీ శుష్కవచన ఖండాలుగా ఉన్నాయి ఏది ఏమైనా ఈ యువస్వరాలు సామాజిక స్పృహను ధ్వనిస్తున్నాయనడంలో సందేహం లేదు.

## స్వాతంత్ర్య సమరయోధుల సంచిక

సంపాదకుడు-వెల్దుర్తి మాణిక్యరావు.
వెల రూ 5=00
ప్రకాశకులు-ఆంధ్ర ప్రదేశ్ స్వాతంత్ర్య సమర యోధుల మహాసభ గాంధీభవన్, హైదరాబాదు.

1981 జనవరి 17,18తేదీలలో జరిగిన స్వాతంత్ర్య యోధుల మహాసభ సందర్భాన్ని పురస్కరించుకొని

వెలువరించిన సంచిక ఇది. ఇందులో డాక్టర్ దాశరథి గారి "త్యాగ పతాకం" అనే కవిత, యం. యస్. రాజలింగం, డా. పి. తిరుమలరావు, చుండి జగన్నాథం, ఎల్. లక్ష్మణ దాసు, గొట్టిపాటి బ్రహ్మయ్య మొదలైన ప్రముఖ స్వాతంత్ర్య యోధుల వ్యాసాలు కూర్చబడినాయి.

మాణిక్యరావుగారి "ఉయ్యాల వాడ నరసింహారెడ్డి" బ్రహ్మయ్యగారి "జైలు జీవితంలోని ముచ్చట్లు-అనుభవాలు" విజయకుమార్ సిన్హాగారి "సర్దార్ భగత్సింగ్" అనే వ్యాసాలు బాగున్నాయి. నాటి రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ మొదలైన ప్రముఖుల సందేశాలు, ఛాయా చిత్రాలు సంచికలో ఉన్నాయి.

## పడమర గాలి

రచన-విద్యా వాగేశ, సాహిత్య చక్రవర్తి, మహామహోపాధ్య పండిత కర్ణవీర నాగేశ్వరకవి.

వెల రూ. 1-50.

ప్రతులకు- డా. కె. రాజశేషగిరిరావు M A. PH.D
హిందీ శాఖ-ఆంధ్ర విశ్వ విద్యాలయము-వాల్తేరు

కీ.శే. వీర నాగేశ్వర కవి గొప్ప విద్వాంసులు, బహు భాషా కోవిదులు, ప్రతిభా వంతులు. వారు రచించిన పద్యకృతి ఇది. ఇందులో అమరభాష, మాతృభాషలు, ఆంగ్లము, ఉద్యోగవాంఛ, గురువులు, శిష్యులు, నమ్మకము, స్వార్థము, లంచము, మతము కులము, మొదలైన 22 శీర్షికలున్నాయి. ప్రతి శీర్షిక గీతమాలికా బద్ధమై ఉన్నది. పడమరగాలి అనగా పాశ్చాత్య నాగరికత. భారతీయసంస్కృతీ సంప్రదాయాలు పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల ఎలా అపమార్గం పట్టాయో ఈ కృతిలోని ప్రతి శీర్షిక వెల్లడిస్తున్నది.

శీర్షికలకు తగిన విషయాలను కవిగారు చక్కగా వివరించారు పడమర గాలి వల్ల భారతీయ సంప్రదాయాలకు వాటిల్లినవిపత్తుకుస్పందించిన కవిగారి ఆవేశం ఈ కావ్యరూపంలో ప్రకటింప బడినది. కృతిలో ఆవేదన కనబడినంతగా కవితాంశ కనిపించదు. పద్య రచన సరళమూ, సాఫీయైన శైలిలో సాగింది.

## భారత నామానుక్రమణిక

రచన-పురాణపండ "శ్రీ చిత్ర"

వెల రూ. 12=00

ప్రతులకు-పురాణపండ కమలాదేవి ఆధ్యాత్మిక ప్రచార సంఘం ఆలమూరు - తూ॥గో॥ జిల్లా.

రచయిత గ్రంథ ప్రారంభంలో చెప్పిన మాటలను బట్టి ఈ గ్రంథంలోని విషయం అవగతమౌతుంది. "మహా భారత గ్రంథమందు వచ్చిన లోకములు, ద్వీపములు, దేశములు, నగరములు, జన పదములు, సముద్రములు, నదములు, నదులు, సరోవరములు, కుండములు తీర్థములు వనములు, పర్వతములు, మతులు.........దానవులు, ఋషులు, మునులు, రాజులు మనుష్యులు, ......... మొదలైన వాటి పేర్లూ వాటి సంక్షిప్త వివరణతో కూడిన అనుక్రమణిక"

కనుక ఇందులో భారతానికి సంబంధించిన అనేక విషయాలు విరింపబడినవి. రచయిత తెలిపి అంశాలు అకారిదిగా కూర్చబడడం విశేషం. ఉదాహరణకు రెండు మూడు తెలుపుతున్నాను.

అతిషండుడు :- బలరాముడు అనంతనాగ రూపం ధరించి పరమధామం చేరు సమయాన స్వాగతం పలకడానికి వచ్చిన నాగులలో ఒకడు.

కాక:- ఒక భారతీయ జనపదం.

కేశ మంత్రి:-స్కందుని అనుచరియగు మాతృక.

కొన్ని అంశాలు రెండు మూడు పేజీల వరకు వివరింపబడినవి

ఇది చాలా గొప్ప ప్రయత్నం. రచయిత బహు గ్రంథ పరిశోధనా, పరిశీలనా, పాండిత్యమూ ఈ రచన తెలుపుతున్నది. కొన్ని అంశాలకు వివరణ మరి కాస్త ఎక్కువగా ఇస్తే బాగుండేదేమో?

— వేముగంటి

—::—




## శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారికి ఏలూరులో సన్మానం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ- మద్రాసు కార్యవర్గ అధ్యక్షులుగా ఎన్నికైన శ్రీ శీర్ల బ్రహ్మయ్య గారిని హిందీ దర్బార్ హాలులో శ్రీ పొట్టి పాండు రంగారావు గారి ఆధ్వర్యములో, దీనబంధు డా॥ చెన్న కేశవుల రంగారావు, M. L A. అధ్యక్షతన ఘనంగా సత్కరించిరి.

హిందీ దర్బార్ కార్యకర్తలు, ప్రముఖ వర్తకులు ప్రముఖ వర్తకులు, హిందీ ప్రచారకులు మంగళవాయిద్యములతో ఊరేగింపుగా వెళ్ళి శ్రీ హిందీ బ్రహ్మయ్యగారిని పూర్ణకుంభముతో స్వాగతము చెప్పి సభాస్థలికి తీసుకువచ్చిరి. కుమారి అనూరాధ ప్రార్థనతో సత్కార సభ కార్యక్రమము ప్రారంభమయినది. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్రశాఖ కార్యవర్గ సభ్యులు శ్రీ కట్టా పూర్ణానందరావుగారు ప్రారంభోపన్యాసము చేసినారు. శ్రీ పొట్టి పాండు రంగారావు గారు నాందీ వచనము పలికినారు. వేద మంత్ర పఠన, మంగళ వాయిద్యములతో శ్రీ శీర్ల బ్రహ్మయ్య గారిని చందన తాంబూలములతో సత్కరించుచూ శ్రీ పొట్టి పాండురంగారావు కనకాభిషేకము చేసిరి. కార్యకర్తలు, హిందీ ప్రచార సంస్థలు, శ్రీ బ్రహ్మయ్య గారిని పూలమాలలతో సత్కరించిరి శ్రీ వెత్సా పాండురంగారావు, సన్మాన పత్రము సమర్పించిరి. శ్రీయుతులు నేరెళ్ళ రాజా, శ్రీ గాంధీ, బ్రహ్మయ్యగారి సేవలను కొనియాడిరి శ్రీ వెత్సా పాండురంగారావుగారు ప్రసంగించిరి సభాపతి డా॥ చెన్నా కేశవుల రంగారావు గారు ప్రసంగిస్తూ నాల్గు దశాబ్దాల పాటు హిందీ భాషా సేవచేసిన భాషా బ్రహ్మను సత్కరించడం హిందీ భాషాభిమానులను సత్కరించడమేనని తమ అధ్యక్షోపన్యాసములో ఉద్ఘాటించిరి. ఉత్తీర్ణ విద్యార్థులకు డా॥ రంగారావు గారు, M. L. A. ప్రమాణ పత్రముల నొసంగిరి. సన్మాన గ్రహీత బ్రహ్మయ్యగారు "ఆనందో బ్రహ్మ'' అంటూ ఈ రోజున మనః పూర్వకముగా కార్యకర్తలు అందించిన సత్కారంనన్ను ఆనంద పరవశుడిని చేసినదని చెప్పి ధన్యవాదములు సమర్పించిరి. అతిథులకు, మద్దుల రామ సుబ్రహ్మణ్యం గారు ఆతిథ్యమందించిరి. శ్రీ వెత్సా పాండురంగారావు గారి వందన సమర్పణతో సన్మాన సభ విజయవంతముగా ముగిసినది

## హిందీశిక్షణ పేరిట అవినీతి అక్రమాలు ఒక స్పష్టీకరణ

- వేమూరి రాధాకృష్ణ మూర్తి

" రాష్ట్రంలో హిందీ శిక్షణ పేరిట విస్తృతంగా అవినీతి, అక్రమాలు" అను శీర్షికన ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రత్యేక ప్రతినిధి ది. 30 ఏప్రిల్ 1983 నాటి ఆంధ్ర పత్రికలో కొన్ని వివరాలు ప్రకటించారు. ఆంధ్ర పత్రికలో ప్రకటించబడిన వివరాల వలన కలిగే అపోహలను తొలగించు ఉద్దేశ్యంతో ఈ ప్రకటన చేయవలసి వచ్చిందని మనవిచేస్తున్నాను.

భారత స్వాతంత్ర్య పోరాటం సాగుతున్న సమయంలో ఒక సాధనంగా మహాత్మాగాంధీ గారి ప్రోద్బలంతో దక్షిణ భారత దేశంలో జాతీయభాషగా హిందీ ప్రచారోద్యమం అరవైనాలుగు సంవత్సరాల క్రితం ప్రారంభమైంది అందునిమిత్తం మహాత్మా గాంధీగారు దక్షిణ భారత హిందీ ప్రచార సభను మద్రాసులో స్థాపించారు ఆ తరువాత ఆంధ్ర, తమిళ కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో సభ శాఖలు స్థాపించబడ్డాయి. మహాత్మాగాంధీగారు యావజ్జీవితం తామే దక్షిణ భారత హిందీ ప్రచార సభకు అధ్యక్షులుగా ఉండి సభను నడిపించారు. బాపూజీకుమారుడు కీ. శే. దేవదాసు గాంధీగారు ప్రథమ హిందీ ప్రచారకుడుగా మాద్రాసువచ్చి హిందీ భాషాబోధన ప్రారంభించారు సభను నడిపించే బాధ్యతను దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, శ్రీ సి. రాజగోపాలాచారి గారు. శ్రీ మోటూరి సత్యనారాయణ వంటి పెద్దలకు గాంధీగారు అప్పగింగారు, మద్రాసు సభ మినిట్సులో పైన తెలిపిన పెద్దల హిందీ సంతకాలు ఇప్పటికీ సురక్షితంగా ఉన్నాయి. ఆంధ్ర రాష్ట్ర శాఖకు బాపూజీ, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారిని అధ్యక్షులుగా నియమించారు. స్వాతంత్ర్య సమరంలో సమిధలుగా వేలాది హింది పండితులు హిందీ రంగంలో ప్రవేశించి ఆంధ్ర దేశంలో జాతీయ భాషా ప్రచారాన్ని సుదృఢమైన పునాదులతో మహోద్యమంగా రూపొందించారు. ఖాదీ, హిందీ, హరిజనోద్యమం గాంధీగారి నిర్మాణ కార్యక్రమాల్లో అంశాలుగా చోటు చేసుకొన్నాయి. త్యాగనిరతి, దీక్ష, దేశభక్తి కారాగార ప్రాప్తి అను లక్ష్యాలతో గాంధీగారి అధ్యక్షతన దక్షిణ భారతదేశంలోని నాలుగు రాష్ట్రాలలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ మాతృభాషా వికాసం, జాతీయ భాషా ప్రచారానికి పూనుకొని పనిచేస్తూ వున్నది. భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత రానురాను అన్ని రంగాలవలెనే హిందీ రంగంలో కూడా వ్యాపార ప్రవృత్తి చోటు చేసుకోవటం ప్రారంభించింది. పవిత్ర భావం, దేశభక్తికి బదులు ధనార్జనకు తప్పు మార్గాలు త్రొక్కడం ప్రారంభమైంది. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా హిందీ ప్రచార రంగంలో అక్రమాలు ప్రారంభమైనాయి, శ్రీ జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగాను, శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు విద్యాశాఖా మంత్రిగాను ఉన్నప్పుడు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్రశాఖ పక్షాన మేము యీ అక్రమాలనన్నిటినీ వారి దృష్టికి తీసుకొని వెళ్ళాము. శ్రీ కృష్ణారావుగారు వెంటనే వాటిని అరికట్టేందుకు అనేక చర్యలు గైకొన్నారు. హిందీ టీచర్స్ ట్రైనింగ పేరిట అక్రమాలు జరుగకుండా కామన్ సిలబస్ ఏర్పాటు చేయించడం, ఉన్నత హిందీ పరీక్షలు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ అధికారుల ద్వారా నడిపించే ఏర్పాటు చేయించడం, విద్యామంత్రి అధ్యక్షతన హిందీ సలహాకార్ సమితి ఏర్పాటు చేయించడం జరిగింది. స్వాతంత్ర్యం లభించిన తరువాత పార్లమెంటుద్వారా జాతీయ సంస్థగా ధృవీకరణ పొందిన దక్షిణభారతహిందీ ప్రచార సభ కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసిన నిర్ణయాలను శిరసావహించింది. పవిత్రమైన ఆశయాలతో బాపూజీ ప్రారంభించిన జాతీయభాషా ప్రచారోద్యమం అవినీతికి ఆలవాలం కాకూడదనేదే మా కోరిక

శ్రీ వెంగళరావుగారి ప్రభుత్వ హయాములో మెరుగైన స్థితి వారి ప్రభుత్వం తొలగిన తరువాత తిరిగి తారుమారు కావటం రువాత వచ్చిన విద్యా శాఖల మంత్రుల దృష్టికి మేము అనేక పర్యాయాలు యీవిషయం తీసుకొని వెళ్లడం, కానీ ప్రయోజనం లేకపోవటం జరిగింది. తత్ఫలితంగా ఈ వ్యవహారం

పత్రికలకు ఎక్కే దుస్థితి ఏర్పడినందుకు విచారిస్తున్నాము. దేశభక్తులఆధ్వర్యాధపాగినదక్షిణభారతహిందీ ప్రచార సభ రకరకాలైన ఆటంకాలను ఎదుర్కొంటు పనిచేస్తున్నదనిమనవి చేస్తున్నాము. సభపక్షాన హిందీ ఉపాధ్యాయులకు శిక్షణ నొసంగే ప్రచారక విద్యాలయాల విషయంలో గానీ, సభ పక్షాన జరిగే హిందీ పరీక్షల విషయంలో గానీ అక్రమాలు జరగదం లేదని మనవి చేస్తున్నాము హిందీ ప్రచార రంగంలో జరిగే అవినీతిని అక్రమాలను తొలగించేందుకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యకర్తలు, సభపక్షాన పనిచేస్తున్న వేలాది సుశిక్షితులైన హిందీ పండితులు, ప్రచారకులు ముందుకు వచ్చేందుకు సిద్దంగా ఉన్నారు.

## అవనిగడ్డ హిందీ ప్రచారక విద్యాలయ వార్షికోత్సవం

జాతీయ భాష హిందీకి తెలుగు దేశం ప్రభుత్వం తగిన ప్రోత్సాహము ఇవ్వగలదనే ఆశాభావాన్ని మాజీ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అవనిగడ్డ గాంధీ క్షేత్రంలోని హిందీ ప్రచారక విద్యాలయం వార్షికోత్సవ సభలో వ్యక్తం చేశారు. ఇంత వరకు భర్తీ చేయకుండా ఉన్న హిందీ టీచర్ల పోస్టులను వెంటనే భర్తీచేసి నిరుద్యోగ హిందీ పండితులకు ఉద్యోగ అవకాశాలు కల్పించాలని ఆయన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

సభకు అధ్యక్షత వహించిన ఎన్. ఎస్ ఎస్. ప్రోగ్రాం అడ్వయిజర్ శ్రీ పి. వెంకట శేషయ్య హిందీ నేర్చుకునే విషయంలో సంకుచిత భావాలకు అస్కారమివ్వ వద్దని, ఇంగ్లీషుతో నిమిత్తం లేకుండా హిందీని పూర్తి జాతీయ భాషగా రూపొందించాలని ఆయన అన్నారు.

హిందీ ప్రచారక విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ కప్పగంతుల సత్యనారాయణ మాట్లాడుతూ నైతిక జీవనానికి విలువనిస్తూ హేతుబద్ధమైన జీవితాన్ని గడపాలని విద్యార్థులను కోరారు.

సభలో ఖమ్మం కాలేజీ లెక్చరర్ శ్రీమతి ఫకీర్ బీ, శ్రీ కోసూరు పున్నయ్య, శ్రీ అల్లాభక్షు శ్రీమతి గాడిచర్ల లలిత, కుమారి భండారు సూర్యకుమారి ప్రసంగించారు.

తొలుత శ్రీ తోట కృష్ణారావు స్వాగతం పలికారు. శ్రీ సి. వి ఎస్. ఆర్. శర్మ వందన సమర్పణ చేశారు.

# శ్రద్ధాంజలి

సుప్రసిద్ధ హిందీ రచయిత, శ్రీ ఆరికపూడి రమేష్ చౌదరిగారు
ది, 30 ఏప్రిల్ 1983 నాడు హఠాత్తుగా పరమపదించారు.
వారి నిర్యాణమునకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-
ఆంధ్రశాఖ, మరియు ఆంధ్రప్రదేశమునందలి
హిందీ ప్రచారకులు తమ ప్రగాఢ సంతాపమును
ప్రకటించుచు, వారి ఆత్మకుశాంతి ప్రసాదించమని
పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాదు

## ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | హిందీ ప్రచారక్ కా ఇతిహాస్ | రు. 10-00 |
| 2. | తెలుగు సాహిత్య వ్యాసాలు | 5-00 |
| 3. | తెలుగు భాషా బోధిని - 1 | 1-00 |
| 4. | ,, ,, ,, 2 | 1-20 |
| 5. | ,, ,, ,, 3 | 1-75 |
| 6. | ,, ,, ,, 4 | 1-50 |
| 7. | తెలుగు కథా మంజరి - 1 | 1-00 |
| 8. | ,, ,, ,, 2 | 1-00 |
| 9. | తెలుగు రచన అనువాదం - 1 | 0-75 |
| 10. | ,, ,, ,, 2 | 1-00 |
| 11. | తెలుగు పద్య మంజరి | 1-25 |
| 1 . | గద్య మంజరి | 3-00 |
| 13. | పద్యమాల | 3-50 |
| 14. | కావ్యమాల | 6-00 |

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D B Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.